మాసపత్రిక



# నవీనవిద్య

A COMPLETE GUIDE FOR SCHOOLING

వెల: 20/-
సంపుటి - 1
సంచిక - 8
డిసెంబర్ 2010

## కొత్త టీచర్లకు సూచనలు...

బోధనకు నో సెలవు

పిల్లలకే కాదు.. టీచర్లకూ ప్రణాళిక

పాఠశాలల్లో అకడమిక్ మానిటరింగ్

## ఉపాధ్యాయులూ

రోజువారీ బోధనలో మీరు ఎదుర్కొన్న, అధిగమించిన సమస్యలు, అవి తలెత్తితే పరిష్కరించుకోవలసిన మార్గాలకు అక్షర రూపం ఇవ్వండి. మీ అనుభవసారమే భవిష్యత్తులో మరెంతో మంది ఉపాధ్యాయుల బోధనా ప్రక్రియకు నవీన మార్గదర్శి కాగలదు. విద్యారంగంలో చేపట్టాల్సిన మార్పులు...సంస్కరణలు.... ఆధునిక బోధనా ప్రక్రియలు... బోధనలో తీసుకురావాల్సిన మార్పులు, ప్రస్తుత విధానంలో లోపాలు.. సరిదిద్దుకోవడానికి చేసే సూచనల్ని ఆహ్వానిస్తున్నాం. స్థూలంగా.. ఒక్కమాటలో చెప్పాలంటే బడి నేర్పిన పాఠాలు.. బడి నేర్వాల్సిన పాఠాలు... మాతో పంచుకోండి.

## చిన్నారులూ

మీ బడిలో ఎంతో మంది ఉపాధ్యాయులుండవచ్చు. వీరిలో కొంత మంది మాస్టర్లు మిమ్మల్ని చదువులో మరింత ప్రోత్సహించి.. మంచి మార్కులు సాధించేందుకు మీకు సహాయపడుతూ ఉండవచ్చు. అలాంటి ఉత్తమ ఉపాధ్యాయుల గురించి.. ఓ చిన్ని వ్యాసం వ్రాసి పంపండి.ఫిర్యాదుల్లా కాకుండా మీ బడి ఎలా ఉండాలో.. నాలుగు ముక్కల్లో చెప్పండి. బడిలోనూ.. బడి బయటా.. మీరు చేసిన, చేసే మంచి పనులు రాష్ట్రవ్యాప్తంగా ఉన్న వేలమంది చిన్నారులతో... 'నవీన విద్య' ద్వారా పంచుకోండి. అలాగే... మీ స్నేహితులు, టీచర్లతో తీయించుకున్న గ్రూప్ ఫోటోలు... మీరు రాసిన కథలు, కవితలు, మీరు వేసిన మంచి బొమ్మలు ఇలా ప్రతిదీ.. 'నవీన విద్య' ఆహ్వానిస్తుంది.

## పేరెంట్స్

ఇవాళ్టి కాలంలో చదువులు పిల్లల వ్యవహారం ఏ మాత్రం కాదు. ఇందులో మీ పాత్ర ఎంతో కీలకమైంది. మంచి బడిని ఎంచుకోవడం మొదలు..పిల్లల్ని రోజూ బడికి పంపడం.. అపైన మార్కులు, ర్యాంకులు ఇలా ప్రతి విషయంలోనూ... పిల్లల కంటే మీరే ఎక్కువ ఒత్తిడికి గురవుతుంటారు. పిల్లల పరంగా.. బడిపరంగా... ఎదురయ్యే సమస్యల జాబితా ఎంతో పెద్దదే. వీటిలో ఎన్నింటినో మీరు పరిష్కరించలేక సతమతమవుతూ ఉండవచ్చు. అలాంటి వాటిని మాతో పంచుకోండి. వివిధ రంగాల్లో నిష్ణాతులైన మేధావులతో వాటికి పరిష్కారాలు సూచిస్తాం. టీచర్లు, బోధనా విధానం, బడి వాతావరణం గురించిన మీ మనసులో మాటలకు అక్షర రూపం ఇవ్వండి. మీకు కోసం కేటాయించిన పేజీల్లో వాటిని చూసుకోండి.



**ఉపాధ్యాయులు, తల్లిదండ్రులూ, చిన్నారులూ... ఇక ఆలస్యమెందుకు... తక్షణం స్పందించి.. మీ భావాలను పేపర్‌పై పెట్టండి. మీ ఉత్తరాలు పంపించాల్సిన చిరునామా...**

**NAVEENA VIDYA**
3-6-182/1&2, Urdu Hall lane, Street No.: 17,
Himayathnagar, Hyderabad - 500 029.
Ph: 040 -23220891. 90303 21433
editor.naveenavidya@gmail.com

KRSA101M250



# లెటర్స్

naveena Vidya


Publisher:
M. SREEDHAR RAO

On Behalf Of:
AKSHARA ENTERPRISES
D.NO. 3-6-521, FLAT NO.401
GHARONDA MAYA
HIMAYATH NAGAR
HYDERABAD-500029.

Email:
editor.naveenavidya@gmail.com

Editor:
N. Mohan Kumar

Editorial Team:
T. Lalitha Prasad
Suman

Layout Artist:
Ravi Sankar P.

Artist:
Nandu

Chief Coordinator (Ops&Mktg)
K. Sreenivas

Printed at:
SREE MATHA PRINTERS
1-1-562/1, GANDHI NAGAR
HYDERABAD–500 020

Subscriptions Rates:
Annual. Rs. 240/-


**చర్చ బాగుంది**

బడిలో పిల్లల ఆకతాయితనం, వేధింపుల గురించి ఈసారి చర్చించారు. బాగుంది. దీన్ని గురించి నిజంగానే సీరియస్‌గా చర్యలు తీసుకోవాలి. ముఖ్యంగా బడి యాజమాన్యాలు, సీనియర్ ఉపాధ్యాయులతోనే అరికట్టగల్గుతాం. అందరూ సక్రమంగా స్పందిస్తారని ఆశిస్తున్నాను.

*– మోహనరావు, టీచర్, విశాఖపట్నం*

**సమయం సరిపోవడం లేదు**

నవీన విద్యలో భాషాబోధన గురించిన వ్యాసంలో ద్వివేదీగారు చాలా అంశాలు చర్చించారు. అయితే అంత గొప్పగా చెప్పాలనే దాదాపు అందరికీ ఉంటుంది. కానీ సమయాభావం, పీరియడ్స్ టైమ్ అనుకూలించవు. సాధ్యమైనంతవరకూ పిల్లలతోనే రాయించడం, చదివించడం చేయిస్తూంటాం.

*– సి.జానకి, టీచర్, విజయనగరం*

**రికార్డింగ్ ప్రస్తావన ఎందుకు?**

బోధనాభివృద్ధికి మూల్యాంకన.. అనే వ్యాసంలో ఆడియో, వీడియో రికార్డింగ్ గురించి ప్రస్తావించారు. అదెలా సాధ్యపడుతుంది? మన తరగతులు, వాతావరణం అందుకు అనుకూలించవు. వాటిపై దృష్టి పెడితే బాగా చెప్పడమన్నది తగ్గుతుందేమో! చెప్పినదాని పట్ల విద్యార్థుల స్పందనే మూల్యాంకనకు సరిపడుతుందని నా అభిప్రాయం.

*–జి.ఎల్.కాంతారావు, టీచర్, మహబూబ్‌నగర్*

**యాక్టివ్ లిజనింగ్ అవసరమే!**

యాక్టివ్ లిజనింగ్, ఆటపాటల గురించిన వ్యాసాలు నచ్చాయి. ముఖ్యంగా బడిలో, ఇంటివద్ద విద్యార్థులు, తల్లిదండ్రులకూ కూడా యాక్టివ్ లిజనింగ్ అవసరం. పిల్లలు క్లాసులో శ్రద్ధగా వినాలి, వారి సమస్యల్ని ఇంటి వద్ద వినడంలో తల్లిదండ్రులు శ్రద్ధవహించాలి. ఆటపాటలూ ఎంతో ప్రధానమన్నది అనాదిగా ఉన్న కాన్సెప్ట్. ఇప్పటి టీచర్లే దాన్ని అంతగా పట్టించుకోవడం లేదు.

*–డి.బసవరాజు, పేరెంట్, హైదరాబాద్*

**నిర్లక్ష్యం నిజమే!**

సెకండరీ విద్యను అందరూ నిర్లక్ష్యం చేస్తున్నారన్న వ్యాసకర్త అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను. పెట్టుబడులన్నీ ప్రాథమిక లేదా ఉన్నతస్థాయికే వెళుతున్నాయి. దీన్ని గురించి ఇకనైనా పట్టించుకుంటే బావుంటుంది.

*– శ్రీలక్ష్మి, టీచర్, వరంగల్*

**జిల్లాల్లో బడిని పట్టించుకోవాలి**

జిల్లా, మండల, పంచాయతీస్థాయిల్లోని పాఠశాలలను పట్టించుకోవాలి. విద్యార్థులకు ఉత్సాహంగా చెప్పాలని అనుకున్నప్పటికీ తగిన సదుపాయాలు, పరికరాలతో ల్యాబ్‌లు అంతగా ఉండటం లేదు. ఇదీ చాలా ప్రాంతాల్లో నేను గమనించినది. ఈ సమస్యల గురించిన వ్యాసాలు వస్తే బాగుంటుందేమో!

*– హెచ్.సదాశివ, టీచర్, నిజామాబాద్*

**జోక్స్, కార్టూన్లు పెంచండి**

మీ మ్యాగజైన్ చదవడానికి, చూడ్డానికి ఎంతో బాగుంటోంది. అయితే జోక్స్, కార్టూన్ల సంఖ్య పెంచితే మరింత బాగుంటుంది.

*– ఎస్.అనంత్, విద్యార్థి, కరీంనగర్*

---

**వ్యక్తిగత వివరాలు**

**మీరు:**

- టీచర్ ☐
- పేరెంట్ ☐
- స్టూడెంట్ ☐

**సెక్స్:**

- స్త్రీ ☐
- పురుషుడు ☐

**విద్యార్హతలు:**

- అండర్ గ్రాడ్యుయేషన్ ☐
- గ్రాడ్యుయేషన్ ☐
- పోస్టుగ్రాడ్యుయేషన్ ☐

**వృత్తి:**

- ఉపాధ్యాయుడు (ప్రయివేటు) ☐
- ఉపాధ్యాయుడు (ప్రభుత్వ) ☐
- ఇతర ఉద్యోగాలు ☐
- బిజినెస్ ☐

పేరు: ______________________

అడ్రస్సు: ______________________

______________________

పిన్ నెంబర్: ______________________

ఫోన్ నెంబర్: ______________________

డీడీ/చెక్ నెంబర్: ______________________

బ్యాంకు: ______________________

తేదీ: ______________________

కొరియాలో ప్రాథమిక విద్య తప్పనిసరి 44



గణితబోధన వాస్తవాలు-సవాళ్ళు 38






54 సహాయపడే చేతులు
ఉదవమ్ కరంగల్



49 గణితంపట్ల ఆసక్తిపెంచే మ్యాజిక్ స్క్వేర్స్



Kids Zone 33

కొత్త టీచర్లూ ఇవి పాటించండి... 6

కథలు చెప్పడం ద్వారా భాషాబోధన 26





# కొత్త టీచర్లూ...
# ఇవి పాటించండి

కొత్తగా ఉపాధ్యాయ వృత్తిలోకి వచ్చినవారు ఎన్నో కలలతో బడిలో చేరుతారు. ఈ రంగంలో ఎంతో అనుభవం గడించినవారితో, మీకంటే ఎంతో సీనియర్లతో కలసి పనిచేయవలసి ఉంటుంది, వారి సూచనలు సలహాలు అవసరార్థం ఉపయోగించుకోవచ్చు. అంతకంటే ముందు మంచి నడవడికతో, స్నేహభావంతో తోటి ఉపాధ్యాయులకు, విద్యార్థులకు దగ్గర కావడానికి ప్రయత్నించాలి. చదవడమంత సులభం కాదు చదువు చెప్పడం. కానీ మీ సంకల్పబలం, నమ్మకం, మీ విద్యార్థుల మనసులో స్థానం సంపాదించేందుకు కొత్త ఉపాధ్యాయులుగా తొలినాళ్లలో తీసుకోవాల్సిన జాగ్రత్తల గురించి ఒక్కమాట...

**బోధన ప్రణాళిక**

పాఠశాలలో కొత్తగా చేరినవారు పాఠం చెప్పడానికి కంగారుపడుతుంటారు. అనుభవం లేకపోవడంతో పిల్లల్ని నియంత్రించడంలో విఫలమై ఇబ్బందిపడతారు. అలాకాకుండా క్లాసుకురావడానికి ముందే పాఠానికి సంబంధించిన బోధనాప్రణాళిక (లెసన్‌ప్లాన్) సిద్ధం చేసుకోండి. దానిప్రకారం క్లాసులో పాఠం చెప్పండి.

**లక్ష్యాలు ఏర్పరచుకోవాలి**

కొత్తగా ఉపాధ్యాయులుగా బడికి వెళ్లేవారు కొన్ని లక్ష్యాలు, అంచనాలు రూపొందించుకోవాలి. నిరంతరం, చక్కగా పిల్లలకు బోధించాలనే నిర్ణయాలు తీసుకోవాలి. పిల్లలకు అర్థమయ్యే భాషలో బోధించాలి. వారి సమస్యలు, ప్రశ్నలు విని పరిష్కారమార్గాలు వారికి అర్థమయ్యేలా చెప్పాలి. మొదటిరోజునుంచే పిల్లలు ఉన్నతస్థాయిలో చదవాలని బోధించాలి.

**నిబంధనలకు కట్టుబడి ఉండాలి**

విద్యాశాఖ మరియు పాఠశాల నియమ నిబంధనలకు ఎప్పుడూ కట్టుబడి ఉండాలి. సంప్రదాయంగా అందరూ అనుసరిస్తున్న నిబంధనలు గనుక వాటిని గౌరవించాలి. నచ్చలేదని మార్పు చేర్పులకు సూచనలు చేయాలనుకోవద్దు. పాఠశాల యాజమాన్యం అమలుచేస్తున్న విధానాలు తెలుసుకోండి. రావలసిన సమయం, టైమ్‌టేబుల్, ఎన్ని పీరియడ్లు, ఏ క్లాసులుంటాయో తెలుసుకోవాలి. అలాగే ముఖ్యంగా పాఠశాల ప్రాంగణం గురించి, మీకు వాహనం ఉంటే దాన్ని ఎక్కడ పెట్టు కోవాలి, ఇతరులకు దానివల్ల ఇబ్బందులు ఉన్నాయా, ఉండవా అనేవీ తెలుసుకోవాలి. సహజంగా సీనియర్లు ఇలాంటి చిన్న విషయాలను కూడా సీరియస్‌గా పట్టించుకుంటుంటారు.

**విమర్శలు పట్టించుకోవద్దు**

పాఠశాలలో చేరగానే సీనియర్లనుంచో, సిబ్బంది నుంచో ఏమైనా విమర్శలు, భిన్నాభిప్రాయాలు వ్యక్తం కావచ్చు. కానీ వాటికి సమాధానం చెప్పవద్దు. వీలైనంత సహనం, శాంతి, స్నేహభావంతో వ్యవహరించండి. కొత్తల్లో విద్యార్థుల తల్లిదండ్రుల నుంచి కూడా విమర్శలు, వ్యతిరేకత రావచ్చు. అపుడు ఆ విద్యార్థుల పూర్వాపరాలు, అభ్యసనస్థాయి గుర్తించి దాని ప్రకారం వారికి సమాధానం చెప్పండి.



## తరగతి గదిలో....

✎ తరగతిని నిర్వహించడం విమాన ప్రయాణంవంటిది. టేకాఫ్, లాండింగ్ ఎంతో కీలకం. విద్యార్థుల ధోరణిని అర్థంచేసుకుని వ్యవహరించాలి. తరగతిలో విద్యార్థులకు చదువుకునేందుకు అనుకూల వాతావరణాన్ని కల్పించాలి.

✎ క్లాసులో పిల్లలందరి పేర్లు గుర్తుపెట్టుకోవడానికి ప్రయత్నించండి. వీలైనంత వరకు వారిని వారి పేర్లతో పిలవడానికి ప్రయత్నించండి.

## టీచింగ్



- పాఠం చెప్పడంలో మెలకువల్ని తెలుసుకోండి. బోధనావిధానాన్ని విద్యార్థుల గ్రహణశక్తిని అనుసరించి మారుస్తూండాలి.
- అర్థవంతమైన, కృత్యాలతో కూడిన కరిక్యులమ్ ఎంతో ఉపయోగకరం. విద్యార్థులు ఎంతో ఆసక్తితో అభ్యసిస్తారు.
- పాఠానికి సంబంధించిన అన్ని అంశాలను వేగంగా, ఒకే పీరియడ్‌లోనే చెప్పేయాలన్న ఆత్రుత ప్రదర్శించవద్దు.
- పాఠ్యాంశం చెప్పడానికి ఒక పద్ధతిని అనుసరించండి. ముఖ్యమైన పాయింట్లు రాసుకుని వాటిని వివరిస్తూ అవసరమైతే బోర్డు మీద రాస్తూ వివరించండి. బొమ్మలు అవసరమైతే వేయండి లేదా చూపండి. అలానే మ్యాప్ పాయింటింగ్ కూడా.
- తరగతిలో ప్రయోగాలు, ప్రత్యేక కృత్యాలు చేపట్టేటపుడు విద్యార్థులను గ్రూప్‌లుగా విభజించాలి. వారి సామర్థ్యం సరిపోదన్నప్పుడు వారికి సూచనలు, సలహాలు ఇవ్వండి.
- తరగతిలో విద్యార్థుల అనుమానాలకు ఓపికతో సమాధానాలు, వివరణలు ఇస్తూండాలి. అలాగే తరగతి బయట కూడా కొందరు వచ్చి ప్రశ్నలు, అనుమానాలు వ్యక్తం చేస్తుంటారు. అయినప్పటికీ వారికి సమాధానాలు చెప్పడం మంచిది. తద్వారా వారికి మీ పట్ల గౌరవంతోపాటు, అభ్యసనలో వారికి వెన్నుదన్నుగా ఉన్నారన్న నమ్మకం కలుగుతుంది.
- విద్యార్థులకు ప్రత్యేకించి ఇచ్చే అసైన్‌మెంట్ల వివరాలు బోర్డుమీద రాయండి. వాటిని వారు నోట్స్‌లో రాసుకుంటారు. తద్వారా విద్యార్థులకు అసైన్‌మెంట్ల గురించి పదే పదే గుర్తుచేయనవసరం ఉండదు.
- హోంవర్క్ అతిగా ఇవ్వద్దు. సబ్జెక్టులో ఇబ్బందులు అధిగమించేందుకు వీలు కల్పించేదిగా హోంవర్క్ ఉండాలి.
- వారాంతపు పరీక్షలు నిర్వహించాలి. అపుడు క్లాసంతా తిరుగుతూ ఎవరు సరిగా రాయడంలేదో గుర్తించండి. ఆ తర్వాత వారి పట్ల ఎక్కువ శ్రద్ధవహించేందుకు వీలుంటుంది. చదువులో వెనుకబడిన విద్యార్థులపైనే ఎక్కువ దృష్టి పెట్టాలి.
- విద్యార్థులంతా తప్పకుండా ప్రతి పరీక్ష బాగా రాసేట్లు, మంచి మార్కులతో ఉత్తీర్ణత సాధించేట్లు చూడండి. వీలైతే అందుకు అదనంగా కొంత సమయం కేటాయించి ప్రత్యేకశిక్షణనివ్వండి.

# క్రమశిక్షణ

టీచర్ టిప్సులు

- 'నో టాకింగ్..' అంటూ కఠినంగా ఆదేశించవద్దు. 'అడిగిన ప్రశ్నకు ఎంతమంది సమాధానం రాశారు?' అని అడగవద్దు. దీని వల్ల వ్యతిరేక ప్రభావం ఏర్పడుతుంది.
- క్రమశిక్షణకు ప్రాధాన్యతనివ్వండి. కానీ కఠిన నిబంధనలు అమలుచేసే యత్నం చేయవద్దు. తద్వారా విద్యార్థులు వ్యతిరేకతకు, నిర్లక్ష్యానికి గురవుతారు. వారి మధ్య అభ్యసనస్థాయిలో తారతమ్యాలు పెరుగుతాయి.
- శిక్షించాలనుపుడు దగ్గరికి పిలిచి చెయ్యిపట్టుకుని కళ్లతోనే భయపెట్టాలేగాని కొట్టవద్దు.
- విద్యార్థులు పాఠం సరిగా వినకుండా అల్లరిచేస్తుంటే లేదా శ్రద్ధచూపకుంటే వారికి పాఠంచెప్పడం ఆపి క్లాసులో ఎలా మెలగాలో బోధించండి. పాఠం వినడంలో మెళకువలు తెలియజేయండి.
- ఎవ్వరూ మీవద్దకు వచ్చి మరీ అల్లరిగా మాట్లాడటం, ఫిర్యాదులు చేయడం జరగకుండా జాగ్రత్తవహించండి. ఆ అవకాశాలివ్వద్దు.
- తరగతిలో ఎంతో సహనంతో మెలగాలి. విద్యార్థుల అల్లరిని భరించాలి. అతిగా ఉంటే వారిని మెల్లగా వారించండి.
- అల్లరిచేస్తున్న పిల్లల్ని తిట్టడం, కొట్టకుండా దగ్గరికిపిలిచి వారు అప్పటివరకూ పరీక్షల్లో తెచ్చుకున్న మార్కులుచూపి ఇంత కంటే మంచి మార్కులురావాలంటే శ్రద్ధగాచదవాలని చెప్పండి. పిల్లలు తప్పును త్వరగానే తెలుసుకుంటారు.
- పాఠం చెప్పేటపుడు పిల్లలందరూ మిమ్మల్నే చూస్తుండేట్టు చేయండి. వెనక, మధ్య బెంచీల్లోవారు సాధారణంగా కొంత నిర్లక్ష్యం గానో, మాట్లాడుతూనో, చిరుతిండితోనో పాఠంపై దృష్టిపెట్టరు. వీరిని గమనిస్తుండాలి.
- అటెండెన్స్ తీసుకునేటపుడు రానివారికి 'యస్సార్' అని పలికే విద్యార్థులూ ఉంటారు. ఎక్కువ దుమ్మాలు కొట్టే విద్యార్థుల పేర్లు నోట్ చేసుకోండి. కారణాలు అడిగి సమస్యలు అధిగమించేందుకు వీలైతే తోడ్పడవచ్చు.
- తరగతిగదిలో విద్యార్థులు రోజుకో చోట కూర్చునేందుకు అనుమతించవద్దు. నిత్యం ఒక క్రమపద్ధతిని అనుసరించేట్టు చూడండి. సాధ్యమైనంతవరకూ చదువులో తక్కువస్థాయిలో ఉన్నవారికి ముందు కూర్చునే వీలుకల్పించండి.

- బోధనకు సంబంధించిన మీ లోటుపాట్లు విద్యార్థులకు తెలియనీయకండి. మీతో బోధనాపరంగా ఇబ్బందిపడే విద్యార్థులు వాటికి వ్యతిరేక ప్రచారాలు చేసి మీ ప్రతిష్టను దెబ్బతీయవచ్చు.
- తరగతి గదిలో జరిగే చర్చలో విద్యార్థులు చెప్పేది అర్థం కానప్పుడు అందరికీ వినపడేట్లు ప్రశ్నను గట్టిగా అడగాలి. అపుడు అందరూ చెప్పే సమాధానాల్లో సరైనది మీరు గుర్తించగలరు. దాన్ని మీరు మళ్లీ చెప్పండి.



- తరగతిలో పాఠం చదివించే ప్రక్రియలో పీరియడ్ అయ్యేలోగా వీలైనంతమందిచేత చదివించాలి. చదివే అంశాన్ని వాళ్ల నిర్ణయానికి వదిలేయవద్దు. చదవడానికి పిలిచినపుడు పేర్లతో పిలవాలి. అపుడు వారికి సన్నిహితంగా, స్నేహంగా ఉన్నారన్న భావన కలుగుతుంది.
- తరగతిలో చదివించేటపుడు అదనపు సూచనలు, ఆదేశాలు తక్కువగా ఉండేట్లు జాగ్రత్తపడండి. విద్యార్థులకు ఇచ్చే ఆదేశాలు వారు స్పష్టంగా అర్థం చేసుకునేట్లు ఉండాలి. కఠినంగా చెబుతున్నట్లు ఉండకూడదు.
- తరగతిలో వచ్చే సమస్యల్ని అధిగమించడంలో విద్యార్థుల సూచనలు తీసుకోవచ్చు. వారి సహకారం అందుకోవడం అగౌరవం కాదు. పైగా స్నేహపూర్వక వాతావరణం నెలకొని బోధనకు, అభ్యసనకు ఎంతో ఉపకరిస్తుంది.

**తోటి ఉపాధ్యాయులతో...**

స్కూల్లో సీనియర్ టీచర్లు, కొత్త టీచర్ల మధ్య స్నేహం అంత సులభం కాదు. ముఖ్యంగా ప్రాథమిక పాఠశాలల్లో అభిప్రాయభేదాలు తలెత్తే అవకాశాలుంటాయి. స్కూల్లో చేరిన కొత్తల్లోనే ఎవరు ఎలాంటివారనేది గమనించుకోవాలి.

- లంచ్ సమయంలో స్టాఫ్‌రూమ్‌లో తోటి ఉపాధ్యాయులతో కలిసి భోజనం చేయడానికి ప్రయత్నించండి. తద్వారా స్నేహసంబంధాలు మెరుగు పడతాయి. మున్ముందు వారు ఎంతో ఉపయోగపడతారు.
- స్కూలు కార్యక్రమాల్లో ఇతరులతో కలిసి చురుగ్గా పాల్గొని వారికి అన్ని విధాలా సహకరించాలి. అందరికీ దూరంగా ఉండటం, క్లాస్ లేదా లైబ్రరీలోనో ఎక్కువ సమయం గడిపేస్తే ఇతరులతో స్నేహం దెబ్బతినే అవకాశం ఉంది.
- బోధనలో ఇబ్బందులు అధిగమించేందుకు సీనియర్ల సలహాలు కోరండి.
- స్కూలు రాజకీయాలకు వీలైనంత దూరంగా ఉండటమే మంచిది.
- పాఠశాలలో ఉన్నంతసేపు మీ సొంత అభిప్రాయాలకు ఎక్కువ ప్రాధాన్యత నీయవద్దు. తోటి ఉపాధ్యాయులతో చర్చించవలసి వస్తే వారి అభిప్రాయాలు పూర్తిగా వినండి. ఏకీభవించకపోతే మీ అభిప్రాయాన్ని సూచించండి. వినాలని పట్టుపట్టవద్దు. పిల్లల్ని, తోటిఉపాధ్యాయులను నియంత్రించడానికి ప్రయత్నించవద్దు.



**పేరెంట్స్**

విద్యార్థుల తల్లిదండ్రులతో సమావేశమవుతుండండి. పిల్లల అభివృద్ధికి సంబంధించి తరచుగా వారితో సంప్రదిస్తుండండి. సమస్యలు తలెత్తకముందే ఈ సంబంధాలు మెరుగుపరచుకోండి.

తరగతిలో నిర్వహించే వారాంతపు పరీక్షలు, ఇతర పరీక్షలకు హాజరుకాని విద్యార్థుల పరిస్థితి గురించి తల్లిదండ్రుల నుంచి వివరణ కోరండి. అనారోగ్యంతో బాధపడినవారికి మరోసారి పరీక్షలు నిర్వహించి ఉత్సాహపర్చండి.

పిల్లలకు సంబంధించి తల్లిదండ్రుల పాత్రను సున్నితంగా వారికి తెలియజెప్పే ప్రయత్నాలు చేయండి. అదేవిధంగా పిల్లలు చేసే తప్పులను మరింత జాగ్రత్తగా వారికి చేరవేయండి. తీవ్రంగా చెప్పడం వల్ల వ్యతిరేక ప్రభావాలు కనిపించే అవకాశం ఉంది.

### స్ఫూర్తి నివ్వండి

- మీ బోధనతో ఎంతో నేర్చుకోగల్గుతున్నాం అనే నమ్మకం పిల్లలకు కలిగించండి.
- పెద్దపరీక్షలకు ఎలా చదవాలి, ఎలా సిద్ధపడాలి, ఎలా రాయాలన్న విషయాల్లో సహాయాన్ని అందించాలి.
- విద్యార్థుల ఆటపాటల్లో మీరూ ఆసక్తి చూపండి. ఆ అంశాల్లో వారిని ఉత్సాహపరిచి మద్దతునివ్వండి.
- తరగతిగదిలో సబ్జెక్టుకు సంబంధించి విద్యార్థుల ప్రత్యేకతలు చాటే బొమ్మలు, చార్ట్‌లు గోడలకు అలంకరించండి.
- చివరి పీరియడ్‌లో పిల్లలకు ఇంటికి వెళ్లేముందు మంచి మాటలు చెప్పండి. స్ఫూర్తిదాతల గురించి చెప్పండి. అది ఎంతో అనకూల ప్రభావం చూపుతుంది.



### జీవితం - వృత్తి మధ్య సమన్వయానికి చిట్కాలు

- ప్రాధాన్యతను ఎంపికచేసుకోవాలి. వృత్తిలో విజయం సాధించాలనే అందరూ కోరుకుంటారు. కానీ అదే జీవితం కారాదు.
- కొత్త ఉపాధ్యాయులు అతిగా పనిచేసేస్తుంటారు. కానీ అలా అదనంగా పనిచేసిన సమయానికి అదనంగా జీతం రాదన్నది గ్రహించాలి.
- కుటుంబానికి, స్నేహితులకు సమయం కేటాయించాలి. పలురకాల పనులతో సతమతం కావద్దు. దీనివల్ల కుటుంబానికి, స్నేహితులకు దూరమయ్యే అవకాశం ఉంది. బడిసమయం తర్వాత మీ వ్యక్తిగత అంశాలపై దృష్టి పెట్టండి.
- వ్యాయామం ఎంతో అవసరం. ఆరోగ్యంగా ఉంటేనే ఎంతయినా శ్రమించగల్గుతారు. దీనిపై దృష్టి సారించండి.
- సీనియర్ ఉపాధ్యాయుల నుంచి సలహాలు తీసుకోండి. బోధన విషయంలో, బోధనా ప్రణాళిక రూపొందించడంలో అనుభవజ్ఞుల అభిప్రాయాలు ఎంతో ఉపయోగపడతాయి. వారి సూచనలు వినండి. వీలైనన్ని పాటించండి. దీనివల్ల ఒకరి పట్ల ఒకరికి నమ్మకం, స్నేహం పెంపొందుతాయి.
- కేవలం డబ్బు సంపాదనతో ఈ వృత్తిలోకి వచ్చేవారుంటారు. జీవితంలో నిలదొక్కుకోవడానికి ఇచ్చే ప్రాధాన్యతలు ఇవ్వాలి. కానీ పాఠశాలలో బోధనాపరమైన లోటుపాట్లకు అవకాశాలు కల్పించకూడదు.

### ముగించే ముందు మరో చిన్న మాట...

మీరూ మనుషులేనన్నది గుర్తుంచుకోండి. తప్పులు సహజంగానే దొర్లుతుంటాయి. అయితే వాటిని అధిగమించే ప్రయత్నం చేయండి. తోటి వారి పట్ల మానవత్వంతో మెలగండి. హాస్యచతురత ప్రదర్శించండి. అదే మీకు శ్రీరామరక్ష.

క్లాసులో ప్రతీ ఒక్కరినీ ఉత్తమవిద్యార్థిని చేయలేకపోవచ్చు, కానీ ప్రయత్నించండి. ఇది మాత్రం మిమ్మల్ని ఉత్తమ ఉపాధ్యాయునిగా తీర్చిదిద్దుతుంది.

లక్షల మంది చిన్నారులకు విద్యాపరిమళాలను అందించేందుకు కోటి కొంగొత్త ఆశలతో.. ప్రభుత్వ కొలువులో కుదురుకున్న కొత్త ఉపాధ్యాయులకు 'నవీన విద్య' మనఃపూర్వక శుభాకాంక్షలు తెలియజేస్తున్నది. మీ వృత్తి, విద్యా జీవితాల్లో మరెంతో ఎత్తుకు ఎదగాలని ఆభిలషిస్తోంది. ఆకాంక్షిస్తోంది.

టాప్ 10

### చివరగా మరోసారి గుర్తుంచుకోవాల్సినవి

1. బడి బయట గడపాల్సిన సమయం కూడా అవసరం పేరుతో బడిలోనే గడిపేయకండి!

2. మీ ఆసక్తులు బడి బయట విశ్రాంతి సమయంలో కొనసాగించండి.

3. ఆశావహంగా ఉండండి, మంచి ఆలోచనపరులతోనే గడపండి. వ్యతిరేక భావాలకు అవకాశమియ్యవద్దు.

4. సమయనియంత్రణ తెలుసుకోండి. సమయాన్ని తెలివిగా ఉపయోగించండి. 40 నిమిషాల వ్యవధిలో ఎన్నో అద్భుతాలు చేయవచ్చు.

5. ప్రాధాన్యతలు ఏర్పరచుకోండి. ప్రతిరోజూ చేయాల్సిన పని గురించి, ఫలితాన్ని గురించి ఆలోచించండి. తొలిదశలోనే బ్రహ్మాండంగా చేయగలనని, చేసేయాలని తొందరపాటు తగదు.

6. మిమ్మల్ని, మీ పనితీరును అంచనా వేసుకోండి. పొరపాట్లను తలచుకుని ఇబ్బందిపడవద్దు. పొరపాట్లనుంచి అధిగమించే యత్నాలు చేయండి.

7. చేసే పనులు, చేపట్టే కృత్యాలు ఒక పద్ధతి ప్రకారం జరిగేలా చూసుకోండి.

8. బోధనగురించి సీనియర్లను వీలైనంతగా ప్రశ్నించి అనుమానాలు నివృత్తిచేసుకోండి.

9. బడిలో, బడిబయట వీలైనంత మద్దతును అందిపుచ్చుకోండి

10. బడి బయట విశ్రాంతికి, వ్యాయామానికి, ఆరోగ్యకరమైన ఆహారాన్ని తీసుకోవడంపైనా దృష్టిపెట్టండి. మీరు ఆరోగ్యంగా, చలాకీగా ఉంటే మీ విద్యార్థులు మిమ్మల్ని ఆదర్శంగా తీసుకుంటారు.

## కొత్త ఉపాధ్యాయులు ఎప్పుడూ...







- ఇష్టాయిష్టాలను బహిరంగంగా వ్యక్తం చేస్తుంటారు. దాని పర్యావసానాలు ఎదుర్కొనవలసి వస్తుంది.
- పొగడటం, ఉత్సాహపరచడం మధ్య ఉన్న తేడా గ్రహించరు.
- దీర్ఘకాలిక, రోజువారీ ప్రణాళికలు పకడ్బందీగా రూపొందించుకోడంలో విఫలమవుతుంటారు.
- తరగతి మొత్తాన్ని కాకుండా ఏ ఒక్క విద్యార్థినో, కొందరినో పర్యవేక్షించడంలో సమయం గడిపేస్తారు.
- విద్యార్థుల దృష్టిని ఆకట్టుకోవడానికి ముందే కొత్త కృత్యాలు ప్రారంభిస్తారు.
- వేగంగా మాట్లాడతారు, కొన్ని సందర్భాల్లో కంగారుపడుతుంటారు.
- మరీ పెద్దగానో, మరీ చిన్నగానో మాట్లాడుతుంటారు.
- ఒకే చోట ఎక్కువ సమయం నిలబడతారు.
- పాఠం చెప్పేటపుడు ఎక్కువసమయం కూర్చునే ఉంటారు.
- వ్యతిరేక అంశాలకే ఎక్కువ ప్రాధాన్యతనిస్తుంటారు.
- పిల్లలు సమాధానం చెప్పడానికి చేతులు పైకెత్తడం ఇష్టపడరు.
- తరగతి గదిలో ఎక్కువగా సీరియస్‌గా ఉంటారు.
- తాము ఇంకా విద్యార్థులమే అన్న తరహాలో ఆకతాయితనాన్ని ప్రదర్శిస్తుంటారు.
- ప్రతిరోజూ ఒకే తరహా బోధనావిధానంతో పిల్లలకు విసుగు పుట్టిస్తారు.
- తరగతి గదిలో ప్రశ్నవేసిన తరువాత సమాధానం కోసం మౌనంగా ఎదురుచూస్తారు. వారిని సమాధానం దిశగా ఉత్సాహపరిచే పనిచేయరు.
- హావభావ ప్రకటన అంత సమర్థంగా ఉండదు.
- ఎక్కువగా తమకు కుడివైపు ఉన్న విద్యార్థులపైనే దృష్టి కేంద్రీకరిస్తారు.
- పిల్లలు ఏదైనా పని చేస్తుంటే దానికి అంతరాయం కలిగిస్తూ, మరో పనిని సూచిస్తుంటారు.
- విద్యార్థులను అల్లరిచేయవద్దని చెప్పడానికి 'ష్...ష్' అని సూచిస్తారు.
- అల్లరిపిల్లల ఆట కట్టించడానికి వారిని దూషిస్తుంటారు.
- విద్యార్థుల నుంచి ఎక్కువ సమాచారం, సమాధానం రాబట్టడానికి ఇష్టపడరు.
- తరగతి నియంత్రణపేరుతో విద్యార్థులను కఠినంగా మందలిస్తుంటారు.
- తరగతిలో ఎంపికచేసుకున్న కొందరితోనే ఎక్కువగా సమాచారం పంచుకుంటూంటారు.
- తరగతిలో పిల్లలు అల్లరిచేస్తుంటే వారిని వారించడానికి వేగంగా నిర్ణయాలు తీసుకోరు.
- పిల్లల పేర్లు తెలుసుకోరు.
- పరీక్ష పేపర్లలో పిల్లలు సరైన సమాధానాలు రాసారా లేదా పరిశీలిస్తారుగాని విద్యార్థి ఆలోచన గమనించరు.
- తరగతిలో దాదాపు ఎవ్వరూ చెప్పలేని క్లిష్టమైన ప్రశ్నలు అడుగుతుంటారు.
- తరగతిలో విద్యార్థులు నేర్చుకున్నదానిపై సమగ్ర పరిశీలన చెయ్యరు.
- అడిగే ప్రశ్నలోనూ సరైన పదజాలం ఉపయోగించరు.
- పిల్లలు అరుస్తూ గోల చేస్తున్నా తమపాటికి తాము పాఠం చెప్పడానికే ఇష్టపడతారు.
- తరగతిలో విద్యార్థులు ఇష్టపడేదేదైనా చేస్తారు.
- విద్యాపరంగా ఉపయోగపడే అంశంలో విద్యార్థులను ఉత్సాహపరచరు.
- ఆత్మాభిమానాన్ని ఎక్కువ ప్రదర్శిస్తుంటారు.
- ఏదైనా కృత్యం చేయించడానికి పటిష్టమైన మార్గదర్శకత్వం వహించరు.
- తరగతిలో చేయవలసిన కృత్యాలను జాప్యం చేస్తారు.
- తరగతిలో త్వరగా ఆందోళనకు, కంగారుకు గురవుతుంటారు.

## ఏది ఉపయోగపడుతుంది...

ఉపాధ్యాయులు, ముఖ్యంగా కొత్త ఉపాధ్యాయులు బోధనా పరంగా ఏ ఆచరణ, ఆలోచన ఉపయోగపడుతుందనే చూస్తుంటారు. క్రమేపీ తమ కెరీర్‌లో నిజంగా బోధనకు ఉపయోగపడే అంశాలను గుర్తించగల్గుతారు. పాఠాలు బాగా చెప్పగలిగితే పిల్లలకు బాగా అర్థమయ్యేట్లు చెప్పగలిగే మార్గాలు అన్వేషించాలి. ఆ మార్గాన్వేషణ గురించే మనం చెప్పుకుందాం...

పాఠాన్ని పిల్లలందరికీ చక్కగా అర్థమయ్యేలా బోధించడానికి, లేదా విద్యార్థులను ఉత్సాహపరిచేందుకు ప్రభావితం చేయగల మార్గాలు ఉన్నాయన్నది చాలామంది అంగీకరించరు. తరగతిలో విద్యార్థులపై ఉపాధ్యాయుల ప్రభావ వ్యత్యాసాలపై వారు ఆధారపడతారు. చెప్పగలిగే సామర్థ్యం ఉంటే ప్రభావితం చేయవచ్చున్నదే చాలామంది అభిప్రాయం. ఏమైనపటికీ దీన్ని గురించిన కొన్ని సూత్రాలు తెలుసుకుందాం..





### సైన్స్, గణితం

- పిల్లలు చిన్న తరగతిలో ఉండగానే బయటి వస్తువుల ఉపయోగంతో గణితాన్ని చక్కగా నేర్చుకుంటారు.
- పిల్లలు చిన్నపాటి ప్రయోగాలు చేయగలిగితే, సైన్స్‌ను కృత్యంగా గమనిస్తే ఎంతో బాగా నేర్చుకుంటారు.
- ఏదైనా లెక్కకు సమాధానం రాబట్టాలనినేర్చుకోవడంతోపాటు, సమాధానాలను అంచనా వేయడం ద్వారా కూడా గణితాన్ని నేర్చుకోగల్గుతారు.

### రాయడం

- దేన్నయినా రాయడంలో అవసరాన్ని స్పష్టం చేస్తే పిల్లలు రాయడం పట్ల ఎంతో ఆసక్తి చూపుతారు.
- రాయడాన్ని నేర్పించడం ఎంతో క్లిష్టమైన పని. మనసుపెట్టి రాసేట్లు చేయడం, తప్పులు దిద్దించడం, సరిచేయడం.. ఇలా అనేకానేక అంశాలు ఉంటాయి.
- పిల్లలకు పూర్వజ్ఞానం, తమ అనుభూతులతో సంబంధం ఉన్నది చదవడంలోనే కొత్త పదాలను కూడా నేర్చుకోవడంలోఎంతో ఆసక్తి చూపుతారు.

### సోషల్‌స్టడీస్

- సోషల్ స్టడీస్ ఎంతో విస్తృతమైంది. దీన్ని కేవలం అనేకానేక వాస్తవాలను గుర్తుంచుకోవడంతో మాత్రమే నేర్చుకోలేరు.
- ఆయా అంశాలకు సంబంధించిన వాస్తవాలను కొత్త ఆలోచనలతో అనుసంధానం చేస్తూ మరింత లోతుగా అర్థం చేసుకోవడం ద్వారా విద్యార్థులు ఎంతో జ్ఞానాన్ని పొందగల్గుతారు.
- పాఠ్యాంశాల్లో పాత్రలను నటించడంద్వారా, ఆటలద్వారా పిల్లలకు సోషల్‌ను ఎంతో ప్రభావితంగా బోధించవచ్చు. అయితే అందుకు ఉపాధ్యాయుడు తప్పకుండా ఆయా అంశాలకు సంబంధించిన గతం వివరించగలగాలి, అందుకు సంబంధించిన కృత్యాలు చేపట్టగలగాలి.

### ప్రేరణ ఇవ్వండి

- విద్యార్థులు నేర్చుకోవాల్సిన అంశాన్ని సక్రమంగా వివరిస్తూ బోధిస్తూ అది విద్యాపరంగా ఎలా ఉపయోగపడుతుందన్నది తెలియజేస్తే, విద్యార్థి తప్పకుండా ఎంతో నేర్చుకుంటాడు.
- విద్యార్థులు కేవలం తాము తెలుసుకున్న వాస్తవాలను గుర్తు చేసుకోవడం మాత్రమే కాకుండా వాటిని విశ్లేషించు కోవడం, తెలిసిన సమాచారానికి అన్వయించుకోవడంలో స్ఫూర్తినిచ్చేవిధంగా ఉపాధ్యాయులు ప్రశ్నలు అడిగితే తప్పకుండా విద్యార్థుల అభ్యసన, ఫలితాలు ఉన్నతస్థాయిలో ఉంటాయి.
- విద్యార్థులు ఎంతో ప్రగతి సాధించాలని లక్ష్యాలు పెట్టుకుంటే వాటిని ఉపాధ్యాయులకు తెలియజేయాలి. తద్వారా ఉపాధ్యాయులు మరింత శ్రద్ధ పెట్టగలుగుతారు, విద్యార్థులు మంచి ఉత్తీర్ణత సాధించగలరు.
- విద్యార్థులు తాము నేర్చుకునేదానిలో విలువలు పొంద గలిగితే ఎంతో స్ఫూర్తి పొందుతారు.
- విద్యార్థులు తమ విజయం స్వయంకృషితోనే సాధ్యపడిందే తప్ప శక్తిసామర్థ్యాలు, అదృష్టం వల్లకాదని భావిస్తే వారు మరింత స్ఫూర్తిపొందుతారు.
- 4-8 ఏళ్ల వయసు పిల్లలు నలుగురిలో మెప్పుతోనే ఎక్కువగా స్ఫూర్తి పొందుతారు.
- పెద్ద తరగతుల్లో పిల్లలు మంచి గ్రేడ్ సాధించడానికి తగిన విధంగా కష్టపడేందుకు, కృత్యాలు చేపట్టడంలో స్ఫూర్తి పొందుతారు. ◆

# ఉపాధ్యాయుడు, విద్యార్థి వినిమయ విధానం

విద్యార్థి, ఉపాధ్యాయుని మధ్య బోధన, అభ్యసన, సంబంధాలు మరింత మెరుగ్గా ఉండాలి. అపుడే బోధనాపరంగా ఉపాధ్యాయుడు, అభ్యసనపరంగా విద్యార్థి లక్ష్యాల్ని సాధించగల్గుతారు. దీనికి సంబంధించిన సిద్ధాంతాన్నే పరస్పర వినిమయ విధానం అంటారు. ఆంగ్లంలో 'ట్రాన్సాక్షనల్ థియరీ' అని పేర్కొంటారు. వ్యాపారి, కొనుగోలుదారుని మధ్య ఉన్నట్లే తరగతిగదిలోనూ ఉపాధ్యాయులు, విద్యార్థుల మధ్య ఈ సిద్ధాంతం సక్రమంగా అమలుకావాలి. తరగతిగదిలో ఇది ఎంత పకడ్బందీగా సాగుతుంటే అంత పటిష్ఠంగా, అంత ఎక్కువకాలం ఉపాధ్యాయుడు, విద్యార్థి మధ్య సంబంధాలు విస్తరిస్తాయి.

విద్యార్థులు, ఉపాధ్యాయుల మధ్య అవగాహనను పెంపొందించుకోవడానికి ఎంతగానో ఉపయోగపడే ట్రాన్సాక్షనల్ అనాలిసిస్ విశ్లేషణకు సంబంధించిన టేబుల్‌ను పరిశీలించండి.

## ప్రత్యక్ష బోధన

**అనుకూలతలు:**

స్పష్టమైన అభ్యసన లక్ష్యాలు.

అంశాల ప్రాధాన్యతను విద్యార్థులకు వివరించి పాఠం లక్ష్యాన్ని స్పష్టంచేయడానికి ఉపకరిస్తుంది.

విద్యార్థి పొందే లాభాన్ని అంచనావేయవచ్చు.

ఎంతో ఆదరణ పొందిన విధానం. కచ్చితమైన అంశాలను, మౌలిక నైపుణ్యాలను బోధించడానికి ఎంతో మంచి పద్ధతి.

**అననుకూలతలు:**

ఉపాధ్యాయుడి సృజనాత్మకతను దెబ్బతీస్తుంది.

మంచి కమ్యూనికేషన్స్ స్కిల్స్‌తోపాటు, విషయావగాహనకు భారీగా కసరత్తు చేయాల్సి ఉంటుంది.

ఒక క్రమబద్ధమైన ప్రణాళిక అనుసరించాల్సి ఉంటుంది.

ఉన్నతస్థాయి ఆలోచనా ధోరణకు ఆస్కారం ఉండదు.

ఉపాధ్యాయుని జ్ఞానం, బోధనా నైపుణ్యం ఆధారంగా ఉంటుంది.

**సంసిద్ధత:**

ముందుగా బోధనాంశాలు క్రమబద్ధీకరించి ఉంటాయి.

పాఠానికి సంబంధించి విద్యార్థి అవసరాల్ని ఉపాధ్యాయుడు ముందుగానే గుర్తించగలగాలి.

## సహకారం ద్వారా అభ్యసన

**అనుకూలతలు:**

ఇద్దరు లేదా కొందరిమధ్య బాధ్యతాయుత భావనను కలగజేస్తుంది. ఇది ఎంతో ప్రభావితమైన విధానంగా పరిశోధనలో తేలింది. విద్యార్థులు ఎంతో సహనంతో, అతిగా విమర్శించకుండా, స్నేహపూర్వకంగా ఉండేందుకు ఈ విధానం దోహదపడుతుంది.

**అననుకూలతలు:**

ఈ పద్ధతి కొందరు విద్యార్థులకు తగదు. ఒంటరిగా చదువుకునే స్వభావం ఉన్న వారు ఈ పద్ధతిలో సమాధానాలు పంచుకోలేరు.

ఆధిపత్య ధోరణి ఉన్న వారు పెత్తనం చెలాయిస్తారు. తెలివిగలవారు తమదే పైచేయి అన్న భావనతో వ్యవహరిస్తుంటారు.

**సంసిద్ధత:**

ఎలాంటి నైపుణ్యాలను పరిజ్ఞానాన్ని పొందాలో నిర్ణయిస్తుంది. బృందాలు కలిసి చదివేందుకు, నేర్చుకునేందుకు కొంతమంది పిల్లలకు సమయం పడుతుంది.

## ప్రసంగ పద్ధతి



**అనుకూలతలు:**

వాస్తవిక అంశాలను ప్రత్యక్షంగానూ, లాజిక్‌గానూ చెప్పే విధంగా ఉంటుంది.

అనుభవసారం ద్వారా విద్యార్థుల్లో స్ఫూర్తిని కలిగించే స్వభావం ప్రసంగ పద్ధతి కలిగి ఉంటుంది.

**అననుకూలతలు:**

పాఠం చెప్పడంలో ఉపాధ్యాయుని మౌఖిక నైపుణ్యం ఎంతో అవసరం.

వినేవారు స్తబ్దుగా ఉంటారు.

అభ్యసనను అంచనా వేయడం కష్టం. సమాచారం ఒకవైపే సాగుతుంది.

నాలుగో తరగతి పిల్లల వరకు ఇది సరైన పద్ధతి కాదు.

**సంసిద్ధత:**

పరిచయం, సారాంశం స్పష్టంగా ఉండాలి.

ఎంచుకున్న బోధనాంశం, సమయంపై దీని ప్రభావం ఆధారపడి ఉంటుంది.

వినేవారిపైనే కేంద్రీకృతమవుతుంది; ఎక్కువగా ఉదాహరణలు, కథనాలతో సాగుతుంది.

## చర్చతో కూడిన ప్రసంగ పద్ధతి



**అనుకూలతలు:**

పాఠం చెప్పిన తర్వాతనైనా విద్యార్థికి చర్చలో పాల్గొనే అవకాశం ఉంటుంది.

తమ సందేహాలను నివృత్తి చేసుకోవడానికి విద్యార్థులకు ప్రశ్నించే, సవాలు చేసే అవకాశం ఉంది.

ఉపాధ్యాయుని ప్రసంగం చర్చగా రూపాంతరం చెందవచ్చు.

**అననుకూలతలు:**

సమయపాలన చర్చకు వీలుకల్పించకపోవచ్చు.

సరైన ప్రశ్న, అర్థవంతమైన చర్చల వల్ల మాత్రమే ఈ పద్ధతి సమర్థవంతంగా కనిపిస్తుంది.

ఉపాధ్యాయులు తరచుగా తమ బోధనా పద్ధతులను ఎంతో వేగంగా మార్చుకోవాల్సి ఉంటుంది.

**సంసిద్ధత:**

ప్రసంగం సాగే సమయంలో ప్రశ్నించేందుకు ఉపాధ్యాయుడు అవకాశం కల్పించాలి.

విద్యార్థుల నుంచి క్లిష్టతరమైన ప్రశ్నల్ని ఆశిస్తూ.. అదే సమయంలో వాటికి సమాధానాలు ముందుగా ఊహించగలగాలి.

## నిపుణుల ప్యానల్

**అనుకూలతలు:**

నిపుణులు పలురకాల అభిప్రాయాలు వ్యక్తంచేస్తారు.

ఒకే వ్యక్తి కాకుండా అనేక మంది చర్చలో పాల్గొనడం వల్ల అది అర్థవంతంగా సాగే అవకాశం ఉంది. ప్రసంగించేవారు మారుతుండటంతో వినేవారి ఏకాగ్రత దెబ్బతినదు.

**అననుకూలతలు:**



వ్యక్తుల వల్ల బోధనాంశం వెనక్కి నెట్టబడే అవకాశం ఉంది.

సబ్జెక్టు నిపుణులు, అంత సమర్థంగా మాట్లాడే వారు కాకపోవచ్చు.

బోధనాంశం ఒక క్రమపద్ధతిలో ఉండకపోవచ్చు.

ప్రాథమికస్థాయి విద్యార్థులకు తగినదికాదు.

వ్యూహరచన ఇబ్బందికరంగా ఉంటుంది.

**సంసిద్ధత:**

ప్యానల్‌లోనివారికి ఉపాధ్యాయుడు సహకరిస్తాడు, అంశానికి సంబంధించి వారికి వివరణ ఇస్తాడు.

ప్యానల్‌ను పరిచయం చేస్తాడు

## మేథోపరమైన చర్చ

**అనుకూలతలు:**

విద్యార్థులు ఎంతో సృజనాత్మకంగా ఆలోచించేందుకు అవకాశం కల్పిస్తుంది.

అందరి అభిప్రాయాలకు సమాన ప్రాధాన్యత ఉంటుంది గనుక తరగతిలో విద్యార్థులందరూ కలిసి పాల్గొనేందుకు ఉత్సాహపరుస్తుంది.

బృందాల పరిజ్ఞానాన్ని, ఆలోచనల్ని పరిగణనలోకి తీసుకుంటారు.

సహకార భావన పెంపొందుతుంది.

ఒక ఆలోచన పలు ఆలోచనలకు దారితీస్తుంది.

**అననుకూలతలు:**

విద్యార్థులు దృష్టి కేంద్రీకరించకపోవచ్చు. 5–7నిమిషాలకు పరిమితం చేయాలి.

తెలిసిన వాస్తవాలకు విద్యార్థులు దూరం కావడం కష్టం.

తరగతి నియంత్రణ సరిగా లేకుంటే విమర్శలు, వ్యతిరేక మూల్యాంకనకు అవకాశం ఉంది.

విద్యార్థుల పరిణితిని బట్టి దీని విలువ ఉంటుంది.

**సంసిద్ధత:**

బోధనాంశాన్ని ఉపాధ్యాయుడు ఎంపికచేస్తాడు.

ఈ పద్ధతి విఫలమైతే క్లాసును నియంత్రించేం దుకు ఉపాధ్యాయుడు సిద్ధంగా ఉండాలి.

## చర్చ

**అనుకూలతలు:**

గ్రూప్‌ల నుంచి అనేక ఆలోచనలు, అనుభవాలు సేకరించవచ్చు.

విశ్లేషించాల్సిన అంశం గురించి చిన్నపాటి ప్రజంటేషన్ ఇచ్చిన తరువాత మాత్రమే ఇది సమర్థంగా ఉపయోగపడుతుంది.

**అననుకూలతలు:**

20మంది విద్యార్థులకు మించి నిర్వహించలేరు.

కొంత మంది విద్యార్థులు ఆధిపత్యం ప్రదర్శిస్తారు.

కాల యాపన అంటూ కొంతమంది పాల్గొనకపోవచ్చు. సహజపంథా తప్పవచ్చు.

**సంసిద్ధత:**

చర్చను సక్రమంగా నిర్వహించేందుకు ఉపాధ్యాయునికి ప్రణాళిక అవసరం.

ప్రశ్నావళి అవసరం.



## చిన్న గ్రూప్ చర్చ

**అనుకూలతలు:**

ప్రతివిద్యార్థి పాల్గొనేందుకు వీలుకల్పిస్తుంది.

చిన్న గ్రూప్‌ల్లో విద్యార్థులు స్వేచ్ఛగా ఉంటారు.

చిన్న గ్రూప్‌లలో ఏకాభిప్రాయసాధనకు వీలుంటుంది.

**అననుకూలతలు:**

చిన్న గ్రూప్‌లుగా చేయడంలో ప్రయోజనాన్ని జాగ్రత్తగా పరిశీలించాలి.

గ్రూప్‌లుదారి తప్పే అవకాశం ఉంది.

**సంసిద్ధత:**

గ్రూప్‌నుంచి సమాధానాలు రాబట్టేందుకు ప్రత్యేకించి ప్రశ్నలు సిద్ధం చేసుకోవాలి.

## కేస్ స్టడీస్

**అనుకూలతలు:**

సమస్యల విశ్లేషణ, పరిష్కార నైపుణ్యత పెంపొందుతుంది.

క్లిష్టమైన సమస్యలకు పరిష్కారమార్గాలు వెతికే వీలుకల్పిస్తుంది.

విద్యార్థుల సరికొత్త జ్ఞానాన్ని, నిపుణతను అమలుచేయడానికి వీలుకల్పిస్తుంది.

**అననుకూలతలు:**

పరిస్థితుల్ని విద్యార్థులు అన్వయించుకోలేకపోవచ్చు.

అసంపూర్ణ సమాచారం అర్థరహిత ఫలితాలనిస్తుంది.

ప్రాథమికస్థాయికు తగినది కాదు.

**సంసిద్ధత:**

ఎలాంటి అంశాన్ని పరిశీలించాలో ముందుగానే అవగాహనకు రావాలి.

## రోల్ ప్లే

**అనుకూలతలు:**

సమస్యను నాటకీయంగా తెలియజెప్పి, ఇతరుల తరహాలో ఆలోచించి, విద్యార్థులు తమ ఆలోచనాధోరణి ద్వారా సమస్య స్పష్టీకరించే వీలుంది.

ఇతర పరిష్కారమార్గాలను కనుగొనే అవకాశం ఉంది.

విద్యార్థులు తమ నైపుణ్యాన్ని ప్రాక్టికల్‌గా అమలుచేసే వీలు కలుగుతుంది.

**అననుకూలతలు:**

కొందరు విద్యార్థులు అతిగా చేతనత్వాన్ని కలిగి ఉంటారు. ఇది సక్రమంగా ఉండదు.

ఎక్కువమంది విద్యార్థులున్న గ్రూప్‌కు ఇది అంత ఉపయుక్తంగా ఉండదు.

కొందరు విద్యార్థులు భయాందోళన భావనకు గురవుతారు.

**సంసిద్ధత:**

విద్యార్థులకు సమస్యను, నిర్వహించాల్సిన చర్యను ఉపాధ్యాయుడు వివరించాలి.

విద్యార్థులకు స్పష్టమైన సూచనలు చేయాలి.

## వర్క్‌షీట్ / సర్వేలు

**అనుకూలతలు:**

ఇతరుల వ్యక్తిగత ఆలోచనల ప్రభావంలో పడకుండా విద్యార్థులు స్వీయాలోచనతో అభిప్రాయాలు గ్రూప్స్‌లో పంచుకునే వీలుంటుంది.

**అననుకూలతలు:**

దీని ఉపయోగం కొంతసమయానికే పరిమితం.

**సంసిద్ధత:** విద్యార్థులకు రాసివ్వాల్సిన వివరణలను సిద్ధపరచుకోవాలి.

## అతిథి వక్త

**అనుకూలతలు:**

విద్యార్థులకు ఎప్పుడూ బోధించేవిధానం ఉండదు.

వక్త తన పంథాలో వివరిస్తారు.

**అననుకూలతలు:**

అతిథి గొప్ప వక్త కాకపోవచ్చు.

**సంసిద్ధత:**

మంచివక్తలతో సంప్రదించి తగినవిధంగా పరిచయం చేయాలి.

## విలువల స్పష్టీకరణ

**అనుకూలతలు:**

విలువలు, నమ్మకాలు తెలుసుకునే అవకాశం ఉంటుంది.

స్నేహపూర్వక వాతావరణంలో విలువల గురించి విద్యార్థులు చర్చించే వీలుంటుంది.

చర్చకు అర్థవంతమైన రూపాన్ని ఇస్తుంది

**అననుకూలతలు:**

విలువల విషయంలో విద్యార్థులు మనస్ఫూర్తిగా ఉండకపోవచ్చు.

తమగురించి మాత్రమే ఆలోచించే విద్యార్థులు ఉండవచ్చు.

**సంసిద్ధత:**

చర్చకు తగిన ప్రశ్నలను తయారుచేయడంలో ఉపాధ్యాయుడు సిద్ధపడాలి.

అలాగే చర్చ గురించి విద్యార్థులకు సూచనలు స్పష్టంగా తెలియజేయాలి. ◆

ఒకరోజు నేను ఇంటికి తిరిగివస్తుంటే ఓ తల్లి, ఏడెనిమిదేళ్ల కూతురు మాట్లాడుకోవడం గమనించాను. వాళ్లిద్దరూ తమకు ముందుగా వెళుతున్న ఇద్దరు ఆఫ్రికన్ల గురించి మాట్లాడుతున్నారు. ఆ అమ్మాయి వాళ్లమ్మని అడిగింది "వీళ్ల జుత్తు ఇంత గుబురు గుబురుగా, రింగులు రింగులుగానే ఎందుకుంటుంది? అటువంటి జుత్తు మనకు ఎందుకు ఉండదు?" అని. దానికి వాళ్ళమ్మ ఏమాత్రం తడుముకోకుండా "ఆఫ్రికన్లందరి జుత్తు అలానే ఉంటుంది" అని సమాధానం చెప్పింది. ఇలాంటి సమాధానాలే పిల్లల్లో 'ప్రశ్నించే ఉత్సుకత'ను దెబ్బతీస్తున్నాయి.

నేను ఆ ప్రశ్నకు సమాధానం చెప్పదలచాను. ఆమె అడిగిన ప్రశ్న జాగ్రఫీకి సంబంధించినది.

## జాగ్రఫీ ఎక్కడ ఉంది?

నా ఉద్దేశంలో జాగ్రఫీ మన జీవితంలో భాగమే; మనందరికీ రోజువారీ జీవితం ప్రారంభమయ్యేది తూర్పున సూర్యోదయం తోనే. ఈ సంగతి ప్రతి పిల్లవాడికీ తెలుసు; అంతేకాదు ప్రతిరోజూ పశ్చిమాన్నే సూర్యాస్తమయం అనీ తెలుసు. అలాగే రుతువులు, పలురకాల పండుగలు, పంటలు, సునామీ, వాతావరణం, ఆహారపు అలవాట్లు, సంస్కృతి, దుస్తుల్లో రకాలు, ప్రాంతీయంగా కనిపించే పలురకాలు జబ్బులు, కనిపించనివీ తెలుసు. కానీ వీటన్నింటికి జాగ్రఫీతో ఉన్న సంబంధమేమిటన్నది తెలియదు.

పిల్లలు మాతృభాష నేర్చుకున్న తర్వాత అత్యంత ఆసక్తితో నేర్చుకోవాలన్న తపనపడేది జాగ్రఫీ కోసమేనని నా నమ్మకం. జాగ్రఫీని జీవితాంతం నేర్చుకుంటారు. 4 నుంచి 14ఏళ్ల పిల్లలు సాధారణంగా అడిగే ప్రశ్నల్ని పరిశీలిద్దాం...

2

- భూగోళం గుండ్రంగా బంతిలా ఉంది కదా, మరి మనం ఎందుకు కిందపడం?
- అరబ్బులు 'థౌబ్'నే ఎందుకు వేసుకుంటారు, నాన్న ఎందుకు వేసుకోరు?
- ఏప్రిల్-మే మాసాల్లో ఎంతో ఎండగా వేడిగా ఉంటుందిగదా, డిసెంబర్‌లో ఎందుకు ఉండదు?
- వర్షాకాలం వస్తూ పోతూంటుందని అంటూంటారు, అది ఉండేదెక్కడ?
- డిసెంబర్‌లో నా పుట్టినరోజుకి కొన్ని మామిడిపళ్లు దాచి ఉంచవచ్చా?
- సూర్యుడు ఉదయం నుంచి సాయంత్రం వరకూ నడుస్తాడా ఎప్పటికీ అక్కడే ఉంటాడా?
- చెన్నైలో ఎప్పుడూ ఒకే రుతువు, అగర్తాలాలో నాలుగు రుతువులు ఎందుకు ఉంటాయి?
- మనం ఎండాకాలంలో కొండ ప్రాంతానికి, చలికాలంలో సముద్రతీరానికి ఎందుకు వెళతాం?
- నేను వేసుకునే గాజులా ఇంద్రధనుస్సు ఎప్పటికీ గుండ్రంగానే ఉంటుందా?
- హైదరాబాద్‌లో మంచుపడటం గమనించలేదు, కానీ హిమాలయాల్లో ఎందుకు పడుతుంది?
- సూర్యాస్తమయం తర్వాత తిరిగి తూర్పున ఉదయించడానికి సూర్యుడు ఎంత వేగంగా వెళతాడు?
- ఇక్కడ మనం జింకను, పులిని చూస్తున్నాంగాని క్రిల్, కివీ కనపడవు!
- ఆకాశంలో పైలట్ దారి తప్పకుండా ఎలా ప్రయాణిస్తాడు?
- ఈ ప్రశ్నలన్నింటికి సమాధానాలు ఎక్కడ లభిస్తాయి?

అమ్మమ్మలు, తాతయ్యలు, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు ఇలాంటి ప్రశ్నలన్నింటికీ తమ అనుభవాలతో సమాధానాలు చెప్పగల్గుతారు. వారు చెప్పే సమాధానాలన్నీ పిల్లలకు అంగీకారయోగ్యంగానే ఉంటాయనీ నమ్ముతాను. కొన్ని ప్రశ్నలకు వివరణ, జ్ఞానం, ఇతర భావాలు వివరించాల్సి ఉంటుంది.

పైన పేర్కొన్న వాటిలో ప్రధానమైన ప్రశ్నలను తీసుకుని పిల్లలు స్వయంగా సమాధానాలు తెలుసుకోవడానికి సహాయపడదాం. మొదటి ప్రశ్న తీసుకుందాం..'గ్లోబ్ గుండ్రంగా ఉన్నప్పుడు మనం ఎందుకు కిందపడం?' ఫుట్‌బాల్‌ను తీసుకుని దాని మీద చిన్న చీమని ఉంచుదాం. అది కదిలేట్టుచేద్దాం. ఇపుడు ఆ చీమ కదలడాన్ని పిల్లవానికి చూపించి చీమ కింద పడిపోతుందా లేక ఎలాంటి ఇబ్బందీ లేకుండా ఉంటుందా అని అడుగుదాం; ఇపుడు పిల్లవాడిని ఆ బంతి కదిలించి, ఏంజరుగుతుందో స్వయంగా పరిశీలించనిద్దాం.

మాతృభాషను నేర్చుకున్నట్టుగానే పిల్లలు జాగ్రఫీని ఎక్కువ శ్రమపడకుండానే



నేర్చుకుంటారు. అందుకు ప్రాథమికస్థాయినుంచి తగిన మార్గదర్శకత్వం అవసరమవుతుంది. కీలకమైన ప్రశ్నలు, వాటికి తగిన విధమైన సమాధానాలు వివరిస్తుంటే పిల్లల ఆలోచన, పరిశీలనను, సమీక్ష, అర్థం చేసుకోవడం, అనుసంధానం చేయడం ఎంతో అభివృద్ధిచెందుతాయి.

జాగ్రఫీ టీచర్‌గా నేను క్లాసులో పాఠం చెప్పేటపుడు ఆ అంశాన్ని క్లాసులో ఉన్న వస్తువులు, పిల్లలు లేదా నేను ధరించిన దుస్తులు, విద్యార్థుల ఎత్తు, రంగు, బ్యాగ్‌ల్లోని వస్తువులు, లంచ్‌కు తెచ్చుకున్న ఆహారపదార్థాలు చివరికి చాక్‌పీస్, బ్లాక్ బోర్డ్‌కు అనుసంధానం చేస్తాను. తరగతిలో పిల్లలకు బోధించేందుకు ఆకాశం, గాలి, వాతావరణం, మబ్బులు, వర్షం మొదలైన అంశాలను



ప్రస్తావిస్తాను. వాతావరణం గురించి చెప్పేటపుడు మాత్రం తరగతి బయట బోధిస్తాను. జాగ్రఫీ ఎక్కువగా మన రోజూవారీ జీవితంతో ముడిపడి ఉంటుంది; అందుకే ఉపాధ్యాయులు జాగ్రఫీ బోధించేటపుడు పిల్లలు రోజూవారీ జీవనంలో చూసే వస్తువులు, అనుభవాలతో పాఠ్యాంశాన్ని అనుసంధానం చేసుకుంటూ పాఠం సారాంశాన్ని స్పష్టంగా తెలుసుకునేట్లు చేయడంలో వారికి సహకరించాలి. పిల్లలు సహజంగా దేన్నయినా కొత్త వస్తువును.. క్రిమికీటకాన్నో, కొత్త ప్రాంతాన్నో, సినిమానో గమనిస్తే, లేదా ఏదైనా పుస్తకాన్ని చదివితే, ఆ అనుభవాన్ని ఇతరులతో పంచుకోవాలని తాపత్రయపడు తుంటారు. ఈ సందర్భంలో ఇద్దరూ ఎంతో నేర్చుకుంటారు.

పిల్లలు తమ స్నేహితులతో మాట్లాడుతున్నప్పుడు లేదా చర్చిస్తున్నపుడు వారు ఎంతో నేర్చుకునేందుకు వీలవుతుంది. సెలవుల్లో అనేక ప్రాంతాలు పర్యటించి తిరిగి వచ్చినపుడు పంచుకునే అనుభవాలు, పరిశీలనలు స్నేహితులతోపాటు ఎంతో అభ్యసనకు దారితీస్తుంది.

అద్భుతంగా జీవించేందుకు జాగ్రఫీ భావనలు నేర్చుకోవడం అవసరమా? మన రోజూవారీ జీవనంలో ఈ భావనలు తోడ్పడతాయా? వీటిని జీవనానికి ఉపకరించే నైపుణ్యాలని అనగలమా? రోజూవారీ జీవితంలో సంఘటనలతో సంబంధం ఉన్న, ఆధారపడిన, ఇతరులపై ప్రత్యక్షంగా పరోక్షంగా ప్రభావితం చేయగల అనుభవాలను భౌగోళిక అనుభవాలని అనవచ్చునా? మనం బతికేందుకు, జీవితాన్ని ఆనందించేందుకు, రోజూవారిజీవనంలో సమస్యలు పరిష్కరించుకోవడానికి, సరైన నిర్ణయాలు తీసుకోవడానికి, ఇతర సబ్జెక్టులు అర్థంచేసుకోవడానికి, మన చుట్టూ జరుగుతున్న సంఘటనలు అర్థం చేసుకోవడానికి, జాగ్రఫీ భావనల అధ్యయనం జీవన నైపుణ్యంగా ఉపకరిస్తాయా? వీటిలో చాలా ప్రశ్నలకు ఒకే సమాధానం 'అవును' అని చెప్పవచ్చు.

**ప్రస్తుతం పిల్లల జాగ్రఫీ సిలబస్... సబ్జెక్టు నేర్చుకునేందుకు ఉపకరిస్తుందా?**

ఇక్కడ బహుశా మనం కొన్ని మార్పులు చేయవలసి ఉంది. ముఖ్యంగా రెండు అంశాల్లో..

- కంటెంట్
- కంటెంట్‌ను అందుబాటులో ఉంచే పద్ధతి.

పిల్లలకు చాలాఅంశాలు ముందే తెలుసునని, వాటిని అభివృద్ధిచేయడానికి, మార్పులుచేర్పులు చేయడానికి, అర్థం చేసుకోవడానికి, ఊహించడానికి సామర్థ్యం ఉందని నమ్మాదాం. ఇపుడు మనం మధ్యవర్తులుగా వారివద్ద ఉన్న వివరణలకు మరింత సమాచారాన్ని జోడించాల్సి ఉంది. ముందు వారికి తెలిసినదాని నుంచి ప్రారంభిద్దాం. వారు తెలుసుకున్నదానికి మరింత సమాచారాన్ని జోడించి అనుభవపూర్వకంగా అభ్యసించేందుకు తోడ్పడాలి. ఉదాహరణకు, 1, 2, 3 లేదా 4 తరగతుల్లో గ్లోబ్ గురించిన అమూర్తభావనను అర్థంచేసుకోవడం కష్టం. పరివర్తన సిద్ధాంతం, భ్రమణం; పగలు, రాత్రి లేదా రుతువులు ఏర్పడటంలో ఈ కదలికల మధ్య సంబంధాలు గ్రహించడం ఆ తరగతుల్లో కష్టం. దీనికి బదులు పిల్లలకు సూర్యోదయం, సూర్యాస్తమయాల గురించి, పగలు సూర్యుడు ఉండే పలు స్థానాలు, నీడల స్థాయి, సూర్యుని కదలికలతో వాతావరణంలో వచ్చే మార్పుల గురించిన అంశాలపై నోట్సు



రాసుకోమని చెప్పాలి. పెద్ద తరగతుల్లో ఇదే సమాచారానికి మరిన్ని వాస్తవాలు జోడించాలి.

**పిల్లలు తమ జ్ఞానాన్ని పెంపొందించుకోవడానికి ఉపాధ్యాయుడు ఏమిచేస్తాడు?**

ఉపాధ్యాయుడు అనుసరించే 'అడగడం' పద్ధతి అంత బలమైనది కాదు. నిజానికి విద్యార్థులు అడిగే 'ఎందుకు?' 'ఎలా' అనే ప్రశ్నలు 'కారణాలు', 'వివరణ' కోరే అభ్యర్థనలే. కారణాలు చెప్పడం వివరించడం వంటిది కాదు. దేన్నయినా నమ్మడం లేదా నమ్మకం కలిగి ఉండటాన్ని గురించి చెప్పడం కారణమవుతుంది. వివరణ అంటే సందర్భాలు, విధానాన్ని గురించినది. అంటే "కొన్ని పర్వతశిఖరాలు





మాత్రమే మంచుతో ఉన్నాయి?" లేదా "అరుణాచల్‌ప్రదేశ్‌లోని నాంథాపాలో (ప్రాంతీయ కాలమానం ప్రకారం ఉదయం 5గంటలకు) సూర్యోదయాన్ని చూసినపుడు, గుజరాత్‌లోని ద్వారకాలో (తెల్లవారుజామున 3 గంటలకు) ఎందుకు ఇంకా చీకటిగా ఉంటుంది?". ఈ రెండు సిద్ధాంతాలు, సూత్రాలు వివరించదగ్గవి. కొన్ని సందర్భాల్లో ఉపాధ్యాయుడు ఇలాంటివి వివరించడానికి టెలిస్కోప్‌ను ఉపయోగించాల్సి వస్తుంది. కానీ చాలాసందర్భాల్లో ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు ఇచ్చే 'వివరణ' నిజమైన వివరణకాదు. ఉదాహరణకు ..

**1 సవన్నాలను 'పార్క్‌లాండ్' అని ఎందుకు పిలుస్తారు?**

కారణం సహజంగా అదంతా పచ్చనిగడ్డితో ఉండి అక్కడక్కడా చెట్లతో కూడి ఉంది. అచ్చం పార్కుల్లో వలె.

**2. నీటిబుగ్గల ప్రత్యేకత ఏమిటి?**

బావి నుంచి నీరు తోడనక్కర్లేదు. నీరు తోడకుండానే పైకి వస్తాయి.

**3. సహారాను ఎడారి అని ఎందుకంటారు?**

ఎందుకంటే ఈ ప్రాంతంలో వర్షాలు అంతగా పడవు.

పైన ప్రశ్నలకు పేర్కొన్న సమాధానాలు యధాలాపంగా ఇచ్చినవేగాని ప్రశ్నలకు తగిన వివరణలతో కూడినవి కావు. ఉదాహరణకు సవన్నాల్లో కొన్ని చెట్లే ఉండటానికి కారణమేమిటి; నీటిబుగ్గలో నీరు వాటికి వీలైనపుడు మాత్రమే పైకి రావడానికి కారణమేమిటి, అలాగే సహారాలో అంతగా వర్షపాతం ఉండకపోవడానికి కారణాలు లోతుగా చెప్పలేదు.

ఇటువంటి సందర్భాల్లో ఉపాధ్యాయుడు వివరణలు ఇవ్వడానికి ఉపయోగించే సూత్రాలు విద్యార్థి సరిగ్గా సమాధానాన్ని ఊహించగలిగేందుకు ఆధారపడేవిధంగా ఉండాలి. భూమికంటే నీరు చల్లబడటం, వేడెక్కడం నిదానంగా జరుగుతుందన్నది తెలుసుకుంటే విద్యార్థులు సముద్రతీరంలో వాతావరణం ఒక మోస్తరుగా ఉంటుందని ఊహించగల్గుతారు. అలాగే నీటిబుగ్గలు ఒక ప్రాంతానికి మాత్రమే పరిమితమని, దాని కింద రాతి ఏర్పాటు కంచం ఆకారంలో ఉంటుందని, త్వరగా హైడ్రాలిక్ ఒత్తిడికి గురవుతుందనీ తెలుసుకుంటే అలాంటి ప్రాంతంలో బావి తవ్వితే నీరు పెద్ద ఎత్తున ఉబికి వస్తుందని విద్యార్థి గ్రహిస్తాడు.

**బడి బయట జాగ్రఫీ తరగతిని ఊహించలేమా?**

ఇందుకు బడి యాజమాన్యం, ఉపాధ్యాయుడు ముందుగా ప్రణాళికను సిద్ధంచేసుకోవాలి. కొన్ని అంశాలను ఎంపిక చేసుకోవాలి. ఉదాహరణకు నేల, భూమికోత, వ్యవసాయం, గ్రామీణుల పనులు, వృత్తులు మొదలైనవి. అలాగే సైన్స్, జాగ్రఫీ తరగతులను ఒకటిగా నిర్వహించడం (సౌరవ్యవస్థ, గనులు), వాతావరణం, శీతోష్ణస్థితి వంటి అంశాలు కూడా సంవత్సరాంతం రుతువులను అనుసరించి బోధించవచ్చు. అందుకు త్వరపడాల్సిందేముంటుంది? నాలుగవ తరగతిలో రెండు రుతువులను, ఏడవ తరగతిలో రెండు రుతువులను చెప్పవచ్చు. అంతేగాకుండా గ్రూప్‌లుగా విభజించి విద్యార్థుల చేత కృత్యాలు చేయించవచ్చు, సినిమాలు చూడటం, పర్యటన పుస్తకాలు చదవడం, ఒక అంశానికి సంబంధించిన మ్యాప్‌లు తయారుచేయడం చేపట్టవచ్చు. విద్యార్థులు అభ్యసించేందుకు ఆసక్తిచూపుతున్న అంశాలకు సంబంధించి స్వయంగా కరిక్యులమ్ తయారుచేసుకోవచ్చు. కొన్ని అంశాలు స్వయంగా లేదా పైతరగతి విద్యార్థుల సహాయంతో బోధించవచ్చు; సంబంధిత అంశాలపై ఇటీవల వచ్చిన పుస్తకాల్లో నుంచి కీలకాంశాలను తరగతిలో లేదా లైబ్రరీ క్లాసులో చదవడం ద్వారా పరిచయం చేయవచ్చు, అలాగే వార్తాపత్రికల్లో సంబంధిత అంశాలపై వచ్చే వార్తలను కట్‌చేసి ఒక పుస్తకంలో అతికించి సమాచారపుస్తకంలా తయారుచేసుకోవచ్చు.

ఈరోజుల్లో జీవనానికి జాగ్రఫీ యాంకర్ వంటిది. మనం నేర్చుకునేవాటిలో చాలామటుకు అనుభవపూర్వకంగానే నేర్చుకుంటాం; అందువల్ల ఎక్కువ సమయమూ పడుతుంది; అలాగాకుండా పాఠశాలలోనే బడి యాజమాన్యం లేదా ఉపాధ్యాయుడు నేర్పే అనేక విషయాలతో పాటు ఈ నైపుణ్యాన్ని కూడా నేర్పితే ముఖ్యంగా ఎక్కడ ఎలా జీవించాలి, ఎక్కడ ఇంటి నిర్మాణం చేపట్టాలి, ఏ ప్లాట్‌ను ఎంపికచేసుకోవాలి, డీజిల్ లేదా పెట్రోల్ కారు కొనాలా మొదలైనవి ఎంతో సులభమయ్యేవి. వీటన్నింటికీ జాగ్రఫీ ఎంతో అవసరం. ఈ భూమిమీద జీవనం సాగించడానికి ఎంతో ఉపయోగపడుతుంది. ◆



తెలుగువారి అభిమాన ప్రచురణ సంస్థ



# ఎమెస్కో బుక్స్




1-2-7, బానూ కాలనీ, గగన్‌మహల్ రోడ్డు,
దోమలగూడ, హైదరాబాద్-500 029.
ఫోన్ : 040-23264028

email : emescobooks@yahoo.com
www.emescobooks.com

ప్రాచీనాంధ్ర ప్రబంధ సాహిత్యం

వచన వేదాలు

ఉపనిషత్తులు

బ్రాహ్మణాలు

పురాణాలు

ప్రముఖుల జీవిత చరిత్రలు

వ్యక్తిత్వ వికాసం

తత్త్వశాస్త్రం

పిల్లలకోసం అందమైన
రంగుల బొమ్మల పుస్తకాలు

సుప్రసిద్ధ రచనల
తెలుగు అనువాదాలు

విజ్ఞాన సర్వస్వాలు

నిఘంటువులు

సాహిత్యం

నవలా సాహిత్యం

జ్యోతిష్యశాస్త్రం

మేజిక్ పుస్తకాలు

కార్టూన్‌లు, జోక్‌లు

వైద్య గ్రంథాలు

'అప్పుడు కోతి గోడ మీద నుంచి దూకి రాముగాడి చేతిలో అరటిపండు లాగేసుకుని పారిపోయిందిలా..." అంటూండగానే కోతి దూకడం, పిల్లవాడి చేతిలో పండు లాక్కుని పారిపోతున్నట్టు తోలుబొమ్మలు వేగంగా కదులుతూండడంతో తరగతిలో పిల్లలంతా అంతే ఆశ్చర్యంతో చూసి ఒక్కసారిగా గట్టిగా నవ్వుతూ చప్పట్లు చరిచారు. 'అబ్బా ఏం దూకిందిరా!!' 'వాడిచేతిలో పండు ఎలా లాక్కెళ్లిపోయిందిరా!!' అంటూ తమ తమ అభిప్రాయాలు గట్టిగానే చెప్పారు. వారిలో ఆనందం ఉరకలు వేస్తోంది. ఇంకా చూడాలన్న ఆసక్తి రెట్టింపయింది. పాఠం చెప్పడంలో, వినడంలో ఓ కొత్తమార్గం ఆ తరగతి గదిని ఉత్సాహపరిచింది.



ఒక జీవితానుభవాన్నిగాని, మరో ఘటనగాని, వార్తను గాని ఎదుటివారికి వివరించేటపుడు ప్రతివారిలోనూ కథకుడు బయటకు రావడాన్ని మనం గమనించవచ్చు. అయితే ఈ కథకులు టీవీ, రేడియోల ముందు, లేదా కుటుంబసభ్యులు మాట్లాడేటపుడు ప్రేక్షకపాత్ర వహిస్తుంటారు. అసలు ప్రపంచంలో అన్నిరకాల సమాచారాలు కథలు, కథనాల చుట్టూనే తిరుగుతూంటాయి. యాడ్‌బోర్డులు, బస్టాండ్‌లు, రైల్వేస్టేషన్లు, నాటకపరిషత్తులు, బడులు, ఇళ్లు, కాలేజీలు, రోడ్లు, పేవ్‌మెంట్‌లు, ప్రకటనలు, కుటుంబాలు, కార్యాలయాలు ఒకటేమిటి సమస్తమూ కథలమయమే! మన అనుభూతులు, జ్ఞాపకాలు కుటుంబసభ్యులతో, స్నేహితులతో పంచుకుంటున్నపుడు వివరించేవన్నీ కథలమయమే. ఒక్కముక్కలో చెప్పాలంటే ఒకరికొకరు ఏదైనా సందర్భాన్నో, ఘటన గురించో తెలియజేయడమన్నది సర్వ సాధారణం. ప్రతిదీ కథనంతో కూడుకున్నదే!

బోధన అంటే కేవలం పాఠం చెప్పడం మాత్రమే కాదు. కథలు చెప్పడాన్ని కూడా బోధనలో ఇమిడ్చి చక్కని పదబంధాలతో ఆకట్టుకునే విధంగా హావభావాలతో చెబుతూంటే పిల్లల్లో అదే ఆలోచనాధోరణి పెరిగి, అది చూస్తున్నట్లే భావించుకుంటారు. ఈ తరహా బోధనను ప్రాథమికస్థాయిలో అవలంబిస్తే పిల్లలు సులభంగా చదవడాన్ని కొనసాగిస్తూ తమ అభిప్రాయాల్ని, ఆలోచనల్ని, భావాల్ని ఎంతో స్పష్టంగా వ్యక్తం చేస్తారు, అదే ఆత్మవిశ్వాసంతో, ఎలాంటి బెదురూ లేకుండా. తమ పరిసరాలకు, తమ సబ్జెక్టులపట్ల స్పందించే సామర్థ్యాలపై ఈ కథలు ఎంతో ప్రభావం చూపుతాయి.

**ఎలా ప్రారంభించాలి?**

కథలు చెప్పేవారుగా కావాలంటే... ముందు చక్కగా కథలు వినగల్గినవారై ఉండాలి. ఇతరులు చెప్పే కథలు వినాలి. వారి భాష, మాట్లాడే తీరు, శబ్దాన్ని ఎక్కడ ఎలా ఉపయోగిస్తున్నారు, వాక్యాన్ని ఎలా రూపొందిస్తున్నదీ, ఎక్కడ నెమ్మదిగా, ఎక్కడ వేగంగా పలుకుతున్నారన్న విషయాన్ని గమనించాలి. మీ చుట్టూ ఉన్నవారి హావభావాలు, సంభాషించే తీరు అన్నీ పరిశీలించాలి. నిత్యం కథలు చెబుతున్నప్పుడే మంచి కథకులు కాగల్గుతారు. కథలు చెప్పే విషయంలో మీకు ఆత్మ విశ్వాసం కలగడంతోపాటు, ఆసక్తి పెరిగినప్పుడు మీరు పుస్తకాలు, టేప్‌ల ద్వారా మరిన్ని కథలు



సేకరించి చదివి అవసరమనుకున్నపుడు వాటిని అలవోకగా చెప్పగలుగుతారు. మీ స్వీయ కథలు వినడానికి సమయం కేటాయించండి. అందులో పాత్ర మీరు కావాలి. కథావస్తువును రెండింతలు చేయడానికి ప్రయత్నించండి. కథలోని ఏదో ఒక పాత్రలో మీరు పరకాయప్రవేశం చేయండి. కథలు చెప్పడాన్ని హిస్టరీ, జాగ్రఫీ లేదా గణితం తరహాలో చూడనప్పుడే ఇది సాధ్యపడుతుంది. ఇదేమీ నేర్చుకోవలసిన, కంఠస్థం చేయాల్సిన సబ్జెక్టు కానే కాదు. అందులోని రహస్యాలు అంత సులభంగా బహిర్గతం కావు. సమయం ఇవ్వండి, వేచి చూడండి, గమనించండి. ఈ మొత్తం విధానం మీ ఆలోచనా నైపుణ్యాన్ని కొంతమేరకు ప్రభావితం చేస్తుంది. మీ స్నేహితులు, పిల్లల పట్ల సావధానంగా ఉండండి. వారు చెబుతున్నది మనస్ఫూర్తిగా వింటున్నట్లు ప్రతిస్పందనలతో నమ్మకం కల్గించండి. కథను చక్కగా వినే వారుగా మీరు గ్రహించుకున్నపుడు ఆసక్తికరంగా కథలు చెప్పేవారిగా ముందడుగు వేయవచ్చు.

**తరగతి గదిలో కథలు చెప్పడం వల్ల ప్రయోజనమేమిటి?**

కథలు చెప్పడం వల్ల తరగతి గది ఎంతో ఉత్సాహపూరిత వాతావరణం ఏర్పడుతుంది. చెప్పే పాఠం సారాంశం విద్యార్థులకు సులభంగా అర్థమవుతుంది. ఐదారు పీరియడ్స్‌లో చెప్పినా అర్థం కాని పాఠం కేవలం ఒకటి రెండు పీరియడ్స్‌లోనే పిల్లలు అర్థం చేసుకుంటారు. అదీ కథ రూపంలో హావభావాలతో చక్కగా చెబితేనే. అయితే ఇక్కడ ఒక్కటి గమనించాలి... మీరు చెబుతున్నపుడు ఉపయోగించే భాష, పదాలు, ఉచ్చారణ అన్నింటిని విద్యార్థులు చాలా నిశితంగా పరిశీలిస్తుంటారు. హిస్టరీలో ఒక సంఘటననో లేదా గణితంలో పిరమిడ్స్ కొలతల గురించో కథా రూపంలో చెబుతున్నప్పుడు పిల్లలు మనసుపెట్టి మరీ వింటారు ఎంతో బాగా అర్థం చేసుకుంటారు. ప్రతి పదం, చెప్పేటపుడు చేసే శబ్దం పిల్లలపై ఎంతో ప్రభావం చూపుతుంది. అందుకే అన్ని రకాల అభ్యసనకు కథలు చెప్పడమే పునాది అంటారు.

**కథలు చెప్పడానికి ఏ వస్తువులు కావాలి?**

కథలు చెప్పడానికి స్వయంగా పూనుకోవాలి. అంతర్గతంగా నమ్మకం, శక్తిసామర్థ్యాలు కథలు చెప్పడానికి సరైన వాతావరణాన్ని సృష్టిస్తాయి. చెప్పడానికి ముందు కథలపట్ల నమ్మకం కలిగి ఉండాలి అదే నమ్మకం పిల్లల్లో ఏర్పడుతుంది.

ఒకరోజు ఇద్దరు వ్యక్తులు ఊసరవెల్లి రంగు గురించి వాదించుకుంటున్నారు. ఒకరు దాని రంగు నీలం అని మరొకరు గోధుమరంగు అని వాదిస్తున్నారు. అక్కడికి దగ్గర్లోని అడవిలో ఉంటున్న వారి స్నేహితుని వద్దకు వెళ్లారు. కానీ ఆ ఇద్దరి వాదనా తప్పని అన్నాడు. "ఊసరవెల్లి నలుపురంగులో ఉంటుంది. నా వద్ద పెట్టెలో ఉంది" అన్నాడు. తీరా పెట్టె తలుపు తీస్తే అందులో ఉన్న ఊసరవెల్లి తెల్లగా ఉంది. అంటే వారెవ్వరి మాటా సరికాదని తేలింది. నిజానికి వారందరన్నదీ నిజమే. ఇలా ఆసక్తిగా ఉంటాయి కథలు. కొన్ని కథలు సత్యాన్ని, మరికొన్ని అసత్యాన్ని తేలుస్తాయి.

ఒక వేదాంతి 'ఈ లోకమంతా కథలతో రూపొందిందేగాని అణువుతో కాదు' అన్నాడు. ఒక్కసారి మీకు కథలపై నమ్మకం ఏర్పడితే, ఆ కథ ఊహించని విధంగా మన ఊహలను జతచేసుకుని ఆశ్చర్యపరుస్తుంది. వంటకు సంబంధించిన అన్ని పదార్థాలు కలిపితేనేగదా రుచికరంగా మారుతుంది. సరే... కథ చెప్పడానికి మౌలిక అవసరాలు ఇవి:

- **హావభావ ప్రకటన**
- **చక్కటి స్వరం**
- **తీరుతెన్నులు**
- **పదాల జోరు**
- **భాషాచాతుర్యం**
- **పదప్రయోగం**
- **విజ్ఞానం**

**ప్రజెన్స్ ఆఫ్ మైండ్**

ఒక కథను పిల్లలకు ఆసక్తికరంగా చెప్పాలంటే దాన్ని అనేకపర్యాయాలు చదవడం ఎంతో అవసరం. "అనగనగా ఒక కాకి ఉండేది..." అనేది చెప్పడం కంటే చదవడం తేలిక. కథచెప్పడం ప్రారంభించినపుడు, చాలా చిన్నదిగా, సులభంగా అర్థమయ్యే పదాలు, వాక్యాల నిర్మాణం ఉండాలి. కథచెప్పడంలో ఘనుడు అనిపించుకోవడానికి ఇవి అవసరం...

- వినేవారికి ఆసక్తికలిగించే కథను ఎంపిక చేసుకోవాలి. మీకు బాగా వచ్చినవి, అప్పటికే మీ కుటుంబసభ్యులతో, తోటివారితో ఆ కథచెప్పడంలో ప్రముఖులనిపించుకోవాలి. ఆ తర్వాతనే వాటిని తరగతి గదిలో చెప్పడానికి సాహసించాలి.
- ఆసక్తి కలిగించేవిధంగా ప్రభావితపరిచేలా చెప్పడం నేర్చుకోవాలి.
- తరగతిలో చెప్పడానికి ముందు అనేకపర్యాయాలు ప్రాక్టీస్ చెయ్యాలి.
- కథ ప్రారంభం, ముగింపు బాగుండాలి.
- కథలోని పాత్రలు సక్రమంగా వ్యక్తంచేసిందీ లేనిదీ పరిశీలించాలి.
- కథ చెప్పడానికి సమయం పాటించండి.
- అందరికీ వినిపించేలా అనేకపర్యాయాలు చదవాలి.
- కథ చెప్పండి.
- కథను అందరికీ వినపడేలా మళ్ళీ చెప్పండి.
- హావభావాల ప్రకటన, శబ్దాలు, నటనకు సిద్ధపడండి.
- సొంత కథలా చెప్పండి.
- ఎంతో చక్కగా చెప్పడానికి సిద్ధపడండి.

ఇపుడు మీరు కథ చెప్పడానికి సిద్ధమైనట్టే...

## భాషాబోధనలో తోలుబొమ్మల వినియోగం

ఏ భాషనైనా నేర్చుకోవడంలో అనుభవపూర్వకంగా చెప్పే విధానం ఎంతో కీలకం. ఈ విధానంలో ముఖ్యమైన అంశాలివి:

1. మోటార్ కంట్రోల్
2. విజువల్ డిస్క్రిమినేషన్
3. ఆడిటరీ డిస్క్రిమినేషన్

ఈ మూడు అంశాలు భాషానైపుణ్యాలైన వినడం, మాట్లాడటం, చదవడం, రాయడం మొదలైనవాటి అభివృద్ధికి దోహదపడతాయి.

**ఇంతకీ తోలుబొమ్మలు ఎందుకు?**

ఉపాధ్యాయుడు ఏమిచేసినా, తోలుబొమ్మలతోనూ చేయవచ్చు! తోలుబొమ్మలు డాన్సచేస్తాయి, మాట్లాడతాయి, పాడతాయి, దూకుతాయి, చదువుతాయి, రాస్తాయి, బోధిస్తాయి కూడా! తోలుబొమ్మలతో బోధన తరగతిగది ఎంతో ఉత్సాహభరితంగా మారుతుంది.

పిల్లలనుంచి అనేక రకాల స్పందనలను మనం గమనించవచ్చు.

- ఇతరులతో మాట్లాడతారు, మంచి వినికిడి నైపుణ్యం తెలుసుకుంటారు, అందరిలో కలవడానికి భాషను సాధనంగా చేసుకుంటారు, మంచి సాహిత్యాన్ని ఆదరిస్తారు, ఆనందిస్తారు, గ్రామర్ ప్రకారం సక్రమంగా ఉన్న భాషను ఉపయోగిస్తారు, వారి భావప్రకటన సజావుగా సాగుతుంది, గట్టిగా అరవడం కాకుండా సున్నితంగా మాట్లాడతారు.
- తోలుబొమ్మలతో పాటు సంజ్ఞలు, లేబుల్స్ వాడితే వాటి ద్వారా రాయడం నేర్చుకుంటారు.
- రూప, శబ్ద, వేగవంతమైన విధానంలో వినడం అర్థం చేసుకోవడంలో కష్టం గ్రహిస్తారు.

తోలుబొమ్మలాటలను పిల్లలు అర్థంచేసుకుని స్పందించడం ఆకర్షణీయంగా ఉంటుంది:

- తోలుబొమ్మల్ని నిజమైన బొమ్మలుగా భావించడంలో వారి నమ్మకాన్ని వదిలేయడానికి ఇష్టపడతారు. చాలామంది ఉపాధ్యాయుల్లో 'ఆంగ్లంలోనే మాట్లాడే తోలుబొమ్మ' ఉంటుంది. ఇది పిల్లల్ని ఆంగ్లంలో మాట్లాడేందుకు ఉత్సాహపరుస్తుంది. పిల్లలు తమ పేర్లు, వయసు, ఇష్టాలు, అయిష్టాలు తెలుసుకునే యత్నంలో ఈ తోలుబొమ్మలు భాషను ప్రేరేపిస్తాయి.
- పిల్లలు కొన్ని సందర్భాల్లో తోలుబొమ్మల్ని వారి భావవ్యక్తీకరణకు ఉపయోగించడం ద్వారా తమ మౌనానికి లేదా మితభాషణకు స్వస్తిపలుకుతారు. గతంలో వారిని పాత్రవహించమని కోరినపుడు చూపని ఉత్సాహాన్ని ఇపుడు ప్రదర్శిస్తారు. పిల్లల్ని కొత్త కొత్త పాత్రలు ధరించి మాట్లాడేందుకు తోలుబొమ్మలు వీలుపరుస్తాయి. వాటిలో రకరకాలు ఉండటంతో తరగతి గదిలో మేజిక్ వాతావరణం నెలకొంటుంది. అంతకుముందు ఏమాత్రం సహకరించని పిల్లలు లేదా పాఠం వినడానికి అస్సలు ఆసక్తి చూపని పిల్లలు తోలుబొమ్మలతో పాఠం చెబుతుంటే ఎంతో హుషారుగా స్పందిస్తారు.
- తరగతి వాతావరణాన్ని ఉత్సాహభరితం చేయడానికి, పిల్లలు మాట్లాడేందుకు, సూచనలు చేయడానికి లేదా భాషను పరిచయం చేయడానికి ఈ తోలుబొమ్మలు ఎంతో ఉపకరిస్తాయి. పాటలు, పద్యపఠనం, మాట్లాడటం, మెరుగుపర్చుకోవడం, నాటికలు వేయడానికి వీటిని చక్కగా ఉపయోగించుకోవచ్చు. ఒక నిర్దిష్ట ప్రదేశంలోనూ వీటిని ఉపయోగించుకోవచ్చు. దెయ్యాలు, రాక్షసులు, భయానక జంతువులు.. ఇలా అన్ని రకాలనూ స్టేజీ మీద ప్రదర్శించవచ్చు.
- రకరకాల పాత్రలకు తగినవిధంగా మాట్లాడటం, అరవడం ద్వారా నటనలో నైపుణ్యాన్ని పెంపొందించుకోవచ్చు. అయితే వీటితో ఆడేవారు వాటిని తగినవిధంగా నియంత్రించడం నేర్చుకోవాలి. మాట్లాడుతున్నట్టుగా నోరు మెదపడం, కొన్నిసార్లు మౌనంగా ఉండడం, లేదా ఇటు అటు, గుండ్రంగా తిరుగుతుండటం,

లోపలికి రావడం, బయటికి వెళ్లడం... ఇలా అనేకం చేయిస్తుండాలి. అయితే చూస్తున్నవారికి అర్థమయ్యేట్లు బొమ్మల్ని ఆడించడం పిల్లలకు తెలియాలి. ◆












# పిల్లల చదువుకంటే ఆనందమేముంది?



నేను చదువుకోలేదు. చదువంటే చాలా యిష్టం. నా చిన్నప్పటి పరిస్థితులు బడికి దూరంచేశాయి. చాలాకాలం బడికి వెళ్లే పిల్లల్ని, యూనిఫాంలో అలా తూనీగల్లా ఆడుతూ స్నేహితులతో కలిసిమెలసి వెళుతున్నవారిని చూస్తూండేదాన్ని. నేనేంపనిచేస్తున్నా మనసు మాత్రం అక్కడికి దగ్గర్లోని బడి ముంగిట్లోనే ఉండేది. పొద్దుటే వినే సుప్రభాతం, మధ్యాహ్నం పిల్లలు పాఠాలు వల్లించడం అన్నీ ఒకటే. నాలుగైదు ఇళ్లల్లో పనిచేసేదాన్ని. వాళ్ల పిల్లలకు ఎంతో ప్రత్యేకంగా, శ్రద్ధగా పనిచేసేదాన్ని. వాళ్లు బడికి వెళ్లేవాళ్లు. నేను వీలు చిక్కినపుడల్లా ఒక చెవి వాళ్లు చదువుతుండే గదివైపే పెట్టేదాన్ని. పిల్లలు ఎంత బాగా శ్రద్ధగా చదివితే తల్లిదండ్రులకు అంత ఆనందం, సౌభాగ్యం కూడా.

చాలాకాలం తర్వాత మా ఇద్దరి పిల్లల్ని బాగా చదివించాలన్న తాపత్రయంతో మా ఆయన్ను ఎలాగో ఒప్పించి కాసింత మంచి బడిలో చేర్చగలిగాను. నేను పనిచేసే ఇళ్లల్లో వాళ్ల పిల్లల పుస్తకాలు ఇచ్చేవారు. అందుకనే వారు జీతం ఎంత ఇచ్చినా పనిచేసేదాన్ని. నేను చదువుకోలేదు. నాలా నా పిల్లలూ చదువులేకుండా తయారవడం ఊహించలేకపోయాను.

బడిలో టీచర్లు, తోటి పిల్లలు ఎంతో మంచిగా చూసుకునేవారు. ఒక్కరిద్దరు టీచర్లయితే మా పిల్లల పట్ల ఎంతో అభిమానంతో ఉండేవారు. పిల్లలు బాగా చదువుతున్నారమ్మా..., బడి మాన్పించకు అంటూ సలహాలిచ్చి ప్రోత్సహించేవాళ్లు. ఏమైనా అదే బడిలో పూర్తిగా చదివించాలన్న పట్టుదల పెరిగింది. పిల్లలూ బాగా చదువుతున్నారు. పెద్ద పిల్లాడు 8, రెండో పిల్లాడు 6 చదువుతున్నారు. వాళ్లు చదువుతుంటే వాళ్లలో నేను నన్ను చూసుకుంటూ ఆనందిస్తున్నాను. మా ఆయనా అంతే. పిల్లల చదువు కష్టమేనని ముందు కొంచెం విసుక్కున్నా, ఇపుడు పిల్లలు చదువుతుంటే పక్కన కూచుని గమనిస్తూంటాడు. పెద్ద క్లాసులకు ఎదుగుతున్నారన్న ఆనందం ప్రతి తల్లిదండ్రులకు ఉన్నట్టే మాకూ ఉంది. కానీ ఫీజులు కట్టాల్సినపుడు దిగులుపట్టుకునేది... ఫీజులు కట్టలేక వీళ్లని బడి మాన్పించాల్సి వస్తుందేమోనని. బడిలో టీచర్లను, హెడ్‌మాస్టర్లను ప్రతిసారీ బతిమిలాడుకోవడం, తిడితే భరించడం మామూలై పోయింది. పిల్లలకు తెలీకుండా ఇద్దరం తిండి తగ్గించుకోవాలనుకున్నాం. ఇద్దరం ఒకపూటే తింటూ పిల్లలకు రెండుపూట్ల పెట్టి, బడికి ఫీజులు కట్టడానికి సరిపడా సొమ్ముకోసం రెక్కలు ముక్కలు చేసుకోదలిచాం.

అదృష్టవశాత్తూ కాస్తంత ఉన్నవారి ఇంట్లో మా ఆయనకు కారు డ్రైవర్‌గా పని దొరికింది. ఎలాగో సర్దుకుపోవాలని గట్టి నిర్ణయానికి వచ్చాం. పెద్ద క్లాసులకు బడిలో చదువుతోపాటు అదనంగా ట్యూషన్ పెట్టి చదివించాలని అన్నారు. అది మావల్ల కాలేదు. బడిలోనే ఎంతో శ్రద్ధగా పాఠాలు వింటూ పిల్లలు తామే ఏదో అవస్థపడుతూండేవారు. పరీక్షల సమయంలోనే ఎంతో ఇబ్బందిగా ఉండేది. వాళ్లకి ఏదైనా తెలీకపోయినా, అనుమానాలు వచ్చినా ఏమీ చెప్పలేని పరిస్థితి మాది. అపుడు వెంటనే నేను పనిచేసే పెద్దమ్మగారింటికి తీసికెళ్లేదాన్ని. వాళ్లమ్మాయి అదేదో కాలేజీలో చదువుతోంది. ఆమె అన్నీ చెప్పి చదివించి పంపేది. ఎంతరాత్రయినా నేను గుమ్మంలో, పిల్లలు ఆమె దగ్గరా కూచునేవాళ్లం.

ఒకసారి పిల్లలు కొంత ఇబ్బందిపెట్టారు. పిల్లలందర్నీ ఎక్కడికో విహారయాత్రకు తీసికెళుతున్నారని, డబ్బులు అడుగుతున్నారని. ఏంచేయాలో పాలుపోలేదు. టీచర్లను కలిశాను. తప్పకుండా పంపాలమ్మా, ఏదో ఒక సాకుచెప్పి మాన్పించకు.. అంది పెద్ద టీచర్. నా దగ్గర పైసలు లేవు. పంపితే లాభమేనని అంటున్నారంతా. ఇక లాభం లేదని ఎప్పుడో మా అత్తమ్మ ఇచ్చిన చీరలు, నగ తాకట్టుపెట్టి డబ్బులు తెచ్చాను. పిల్లలు వెళ్లొచ్చారు. ఏదో నేర్చుకున్నామన్నారు. కానీ డబ్బుకు వడ్డీతోసహా కట్టడానికే ప్రాణం పోయినంత పనైంది. అప్పటికీ పెద్దమ్మగారి కోడలు కొంత సాయం చేసింది. ఆ తల్లి బంగారం. చదువుకునేవాళ్లంటే ఎంతో అభిమానం. అది మాకూ వరమైంది.

పిల్లల్ని పెంచడం, పోషించడం కంటే చదివించడం మరీ కష్టమైపోతోంది. ఏడాదికేడాది ఫీజులు, బట్టలు ఖరీదైపోయాయి. మా ఇంటి నుంచీ అరగంట నడిస్తే బడి వస్తుంది. పిల్లలు అలానే వెళుతున్నారు. బడి చూడ్డానికి పాతకాలం మేడలా ఉన్నా, టీచర్లు, హెడ్‌మాస్టర్‌సారూ ఎంతో మంచివాళ్లు. పాఠాలూ బాగా చెబుతారు, ఎంతో ఆదరిస్తారు. అపుడపుడు తిండి పెడుతూంటారు. బడి సెలవలిస్తే నేనూ పనికిపోతాననేవాడు మా పెద్దోడు. దుఖం కట్టలు తెంచుకునేది. మేమిద్దరం కష్టపడుతున్నామన్నది వాడికి అర్థమైంది, సాయంచేయాలన్న ఆలోచన వచ్చింది, కానీ వాడిని పుస్తకాలు చదవమనేదాన్ని, టీచర్ల ఇంటికి వెళ్లి ఏదైనా నేర్చుకోమనేదాన్ని. అంతేగాని పనికి మాత్రం పంపలేదు. చిట్టిచేతులు నలిగితే పుస్తకాలు ఎలాపడతాయి? నాకు లేని అదృష్టం వీళ్లకి కలిగింది. దాన్ని దూరం చేయకూడదనుకున్నాను. అందుకే పరుగున లెక్కల టీచర్ ఇంటికి వెళ్లాను... అబ్బాయికి లెక్కలు చెప్పమని. పిల్లాడిని పిలిచి మాట్లాడింది. వాడు రోజూ మూడుగంటలు వెళుతున్నాడు. లెక్కలంటే భయం పోయింది. చిన్నాడికి కూడా వాడే చెబుతున్నాడు. అక్షరాలు కూడబలుక్కుంటూ చదువుతుంటే ఆ ఆనందంలో మాకు తిండి ధ్యాసా ఉండదు. తోటి పిల్లలు రోడ్లమీద ఆడుతున్నా, వీళ్లు ఆడటం లేదని గేలిచేసినా పిల్లలిద్దరూ గొడవపడరు. ఆటలాడటం మంచిదే. కానీ చదువుమాని ఆడటం మంచిదికాదని నా అభిప్రాయం. దీన్ని అంతా ఒప్పుకోవాలని కాదు కానీ మాలాంటి బీదకుటుంబాలకు చెందినవారంతా పిల్లల చదువు విషయంలో శ్రద్ధపెడితే సాయం చేసేవారుండకపోరు. చదువు నేర్చుకోవడం ఎంతవసరమో నాకు ఆలస్యంగా తెలిసింది.

నాలాంటి వారంతా
ఇకనైనా మేల్కొనాలని
కోరుకుంటున్నాను.

– ఓ అమ్మ








1. కంపెనీ యం.డి. విమానంలో బిజినెస్ ట్రిప్ మీద ముంబైకి వెళ్తుంటే వాచ్‌మన్ అతన్ని ఆపి చెప్పాడు.

"సార్... మీరు విమానంలో ఎక్కకండి. అది కూలుతుందని నిన్న నాకు కల వచ్చింది."

యం.డి. అతని మాట విని విమాన ప్రయాణాన్ని రద్దు చేసుకున్నాడు. నిజంగానే ఆ వాచ్‌మన్ చెప్పినట్లుగా ఆ విమానం కూలి అందులోని వారందరూ మరణించారు. యం.డి. అతన్ని పిలిచి తన ప్రాణాలు కాపాడినందుకు పదివేల రూపాయలు బహుమతి ఇచ్చి, ఉద్యోగం లోంచి తీసేశాడు! ఎందుకు ఉద్యోగం లోంచి తీసేసాడు?

జవాబు : వాచ్‌మేన్‌గా ఉండి రాత్రంతా నిద్రపోయినందుకు.

2. నేను అవిశ్రాంతంగా పరిగెత్తుతూ మీకు ఎప్పుడూ ఏదో ఒకటి చెబుతూంటాను. ఇంతకీ నేనెవర్ని?

జవాబు: గోడ గడియారం.

3. గ్రీకు మేథమెటీషియన్ డిమిట్రస్ 1991లో తన 65వ పుట్టినరోజున 'అయిదేళ్ల తర్వాత తన 70వ పుట్టినరోజున పిరమిడ్స్ చూడాలను'కున్నాడు. 1986లో పిరమిడ్స్ సందర్శించాడు. ఇదెలా సాధ్యం?

జవాబు: అది క్రీ.పూ.1986

4. ఈ క్రింది ఆంగ్ల పదంలో మధ్యలో మిస్సయిన 5 అక్షరాలని పూరించగలరా?

UND.....................................UND

జవాబు : UNDERGROUND

5. డిసెంబర్ నెలలో ఉండి, మిగతా నెలల్లో లేనిది ఏమిటి?

జవాబు: 'డి' అక్షరం.

6. ఈ క్రింది ఇంగ్లీషు వాక్యంలోని ప్రత్యేకత ఏమిటో చెప్పగలరా?

I DO NOT KNOW WHERE FAMILY DOCTOR ACQUAIRED ILLEGIBLY PERPLEXING HANDWRITING

జవాబు: పై వాక్యంలో మొదటి పదంలో ఒక అక్షరం రెండో పదంలో రెండక్షరాలు, మూడోపదంలో మూడు అక్షరాలు .. ఇలా చివరి వరకు ప్రతీ పదంలో ఒక్కో అక్షరం పెరుగుతూ వచ్చింది.

7. వీరెవరు? ఆ వ్యక్తి నా సోదరి కాదు. సోదరుడు కూడా కాదు. కాని ఆ వ్యక్తి నా తల్లిదండ్రుల బిడ్డే. ఆ వ్యక్తి ఎవరు?

జవాబు: నేనే.

8. ఓ అడవిలో ఆరుగురు సైనికులు వెళ్తున్నారు. వారికి ఆకలేసింది. ఓ మామిడిచెట్టు కనిపిస్తే వారంతా గుర్రాలు దిగారు. తలాకరు ఓ మామిడిపండుని కోసారు. మొత్తం ఎన్ని మామిడిపళ్ళు కోసినట్లు?

జవాబు: 'తలాకరు' అనేది ఓ సైనికుని పేరు!

9. మీరు సినిమాకి వెళ్ళడానికి తయారై సాక్స్ వేసుకోబోతుండగా విద్యుత్ కోత వల్ల కరెంట్ పోయింది. మీ సాక్స్ ఓ అల్మారాలో ఉన్నాయి. ఆరు తెల్లసాక్స్ జతలు, ఆరు నల్లసాక్స్ జతలు. మీరు ఒక రంగు సాక్స్ ఓ జత తీసుకోవాలంటే ఆ 12 జతల సాక్స్‌ల్లోంచి కనీసం ఎన్ని సాక్స్ తీయాలో చెప్పగలరా?

జవాబు: కనీసం మూడు సాక్స్‌లు తీయాలి. ఆ మూడింటిలో మూడు నలుపు ఉండవచ్చు లేదా మూడూ తెలుపే అయివుండచ్చు లేదా రెండునలుపు ఒకటి తెలుపు అయివుండచ్చు పై కాంబినేషన్‌లో దేంట్లో అయినా రెండు సాక్స్ ఒకే రంగువి అయివుంటాయి.

# Kids Zone

# స్వభావం

ఒక వర్తకునికి నలుగురు కుమారులు. అతను చనిపోయే ముందు వారిని పిలిచి "తూర్పు ఇంటి అడ్డగోడ కింద నాలుగువేల వరహాలు దాచాను. నా తర్వాత సమంగా పంచుకోండి" అన్నాడు.

వారిలో ఒకడు మిగిలిన వారికి తెలియకుండా ఆ సొమ్ము అపహరించాడు. కొంతకాలానికి సోదరులు ఆ ధనాన్ని పంచుకోవాలని అక్కడ వెదికితే లేదు. దాంతో నువ్వు తీశావంటే నువ్వు తీశావని కేకలు వేసుకుని రాజసభకు వచ్చి తగవు తీర్చమన్నారు. "కొంతకాలం ఆగి రండి" అని రాజు వారిని పంపించేశాడు. కొన్నాళ్లయ్యాక మళ్లీ ఆ నలుగురు అన్నదమ్ములూ రాజసభకు వచ్చారు. వారి నుంచి నిజాన్ని రాబట్టడానికి రాజు వారికి ఒక కథ చెప్పాడు.

"ఒకరాజు తన కుమార్తెకు గురువువద్ద సమస్తవిద్యలూ నేర్పించాడు. ఆమె గురువుగారికి దక్షిణనీయబోయి బంగారు పళ్లెంలో దుస్తులు, నగలు అన్ని పెట్టి తీసుకెళ్లగా "నాకివి అక్కర్లేదు, నీ వివాహం రేపనగా అపుడు కోరతాను" అన్నాడు. తీరా ఆమె వివాహం ముందురోజు అడగగా "శోభనానికి ముందురోజు అన్ని ఆభరణాలూ ధరించిరా" అన్నాడు. గుణవతి అయిన ఆ రాకుమారి వాగ్దానాన్ని నిలుపుకొనేందుకు శోభనంనాటి రాత్రి గురువు వద్దకు వెళ్తూండగా దారిలో దొంగలు అడ్డగించారు.

'దొంగలారా! నేనొక చోటకి వెళుతున్నాను. త్వరగానే తిరిగి వచ్చేస్తాను నగలన్నీ అపుడు మీకిచ్చేస్తాను. నన్ను మాట నిలబెట్టుకోనివ్వండి' అని కోరగా వారంగీకరించి ఆమెను పోనిచ్చారు. ఆమె గురువు వద్దకు వెళ్లగా ఆయన "నీ భర్తతో సుఖంగా జీవించు" అని ఆశీర్వదించి పంపేశాడు. దారిలో దొంగలు ఎదురయ్యారు. వారిని నగలు తీసుకోమని చెప్పింది. కానీ వారు "ఆడి తప్పని నీవంటి గుణవతి ఆభరణాలు దొంగిలించడం తగదు. నీ భర్తతో సుఖంగా ఉండమ్మా" అని పంపేశారు. ఆమె తన భర్తను చేరి జరిగినదంతా చెప్పింది.



కథను విన్న సోదరులను రాజు "వీరిలో గొప్ప గుణవంతులు ఎవరు?" అని అడిగాడు. "శోభనం పెళ్లి కూతురుని పరాయివాడిదగ్గరికి పంపిన భర్త గొప్ప గుణవంతుడు" అన్నాడు మొదటివాడు. "ఆడితప్పని రాకుమారే గొప్ప గుణవంతురాలు" అన్నాడు రెండోవాడు. "మరో ఆలోచనలేకుండా రాకుమారిని ఆశీర్వదించిన గురువే గొప్పవాడు" అన్నాడు మూడోవాడు. "కాదు దొంగలే గొప్ప గుణవంతులు" అన్నాడు నాలుగోవాడు.

వారి సమాధానాలనుబట్టి రాజుకు నా నలుగురురిలో దొంగ ఎవరో తెలిసింది. కొద్దిరోజుల తర్వాత చివరివాడిని పిలిచి నువ్వే మీ తండ్రి సొమ్మును కాజేశావని నిలదీశాడు. వాడు అంగీకరించి అన్నలకు వారి వాటా ఇచ్చేశాడు.

## క్లాసులో అగ్నిపర్వతం



తరగతి గదిలో అగ్నిపర్వతం పేలడం ఊహించగలరా? అది కూడా చేసి చూపించవచ్చు. కొన్ని కెమికల్స్‌తో చిన్నపాటి అగ్నిపర్వతం పేలడం, నిప్పులు వెదజల్లడం చూపించవచ్చు. దీనికి కావలసిందల్లా అగ్ని పర్వతం మోడల్. అందుకు బేకింగ్ సోడా, ఎర్రరంగు, ప్లాస్టిక్ గరాట లేదా సోడా సీసా. మొదట అగ్నిపర్వతానికి ఆధారంగా ఉండే ప్లాట్‌ఫామ్‌ను కార్డ్‌బోర్డ్‌తో తయారుచేసుకోవాలి. దాని మధ్యగా ప్లాస్టిక్ గరాట బోర్లించి పెట్టాలి. దాన్ని బోర్డ్‌కి టేప్‌తో అతికించాలి. తర్వాత 5 లేదా 8 చుక్కల డిటర్జంట్ పౌడర్, ఎర్రరంగు కలపాలి. దాన్ని తగినంత నీటితో కలపాలి. దీన్ని ప్లాస్టిక్ సీసాలో 2/3 వంతు నింపాలి. ఇపుడు ఈ సీసాను మధ్యలో పెట్టాలి. దీనిలో 2 లేదా 3 టేబుల్‌స్పూన్ల బేకింగ్ సోడా కలిపి కొద్ది నిమిషాలు వేచి వుండాలి. చివరగా ఆ మిశ్రమంనుంచీ అగ్ని ఉబికినట్టు ఎర్రనీరు పొంగి పొర్లుతుంది! తమాషాగా ఉంది కదూ!!

# Kids Zone

## ఇంట్లోనే రెయిన్‌బో!



**అవసరమైన వస్తువులు:**

టేప్
నీళ్ళు
అద్దం
కత్తెర
తెల్లటి కార్డు
చీకటి గది
ప్లాస్టిక్ డబ్బా
ఫ్లాష్ లైట్ లేదా టార్చ్
నల్ల దళసరి కాగితం

**ఇలా చేయాలి:**

1. టార్చ్‌లైట్ లేదా ఫ్లాష్‌లైట్ ముందుభాగానికి తగినట్టు నల్ల దళసరి కాగితాన్ని కట్ చేయండి.
2. కట్‌చేసిన గుండ్రని కాగితం మధ్యలో చిన్న రంధ్రం చేయండి.
3. కట్‌చేసిన కాగితంముక్కని టార్చ్ ముందుభాగానికి అంటించాలి.
4. ప్లాస్టిక్ డబ్బాలో సగం వరకూ నీళ్ళు పోయండి.
5. నీళ్ళలో అద్దాన్ని నిలబెట్టండి. అది ఒక వైపుకి ఒరిగి ఉంటుంది.
6. ఇపుడు టార్చ్ ఆన్ చేయండి. సన్నటి వెలుగు కిరణం అద్దంమీద పడేట్టు చూడండి. టార్చ్ ప్లాస్టిక్ డబ్బా బయటనే ఉండాలి.
7. తెల్లకార్డును చేత్తో ఎత్తి పట్టుకోవాలి. అద్దంమీద పడిన వెలుగు తెల్లకార్డుమీద పడి రైన్‌బో దర్శనమిస్తుంది.

అలా తెల్లకార్డుమీద రైన్‌బోని చూడగల్గుతాం. టార్చ్ నుంచి వెళ్లిన వెలుగు కిరణం నీటిలో ఒంగుతుంది. నీటిలో అన్ని రంగు కిరణాలు వాటి వాటి వేగంలో పయనించడంతో వాటిని అద్దంమీద ఏడు రంగులూ స్పష్టంగా చూడగల్గుతామన్నమాట!

వ్యాయామం

### టో వాకింగ్!

అంటే మునివేళ్లమీద నడవడం. సాధారణంగా మనం పాదాలు పూర్తిగా నేలకు ఆనించి నడుస్తాం. అలాగాకుండా మడమ భాగం పైకెత్తి నడవటాన్ని టో వాకింగ్ అంటారు. ఇది మనం ఇంట్లోనో రోడ్డుమీదనో నీళ్లున్నచోట నడిచేటపుడు అప్రయత్నంగా చేస్తుంటాం. ఇది పిల్లలచేత రోజూ కొంతసేపు చేయిస్తుంటే కాలి కండరాలు బలపడతాయి. ఎలా నడవాలో బొమ్మను చూస్తే తెలుస్తుంది.

### లెక్కల ట్రిక్

మీరు క్లాసులోనే కాదు బయట మీ తల్లిదండ్రులతో ఎక్కడికన్నా వెళ్లినపుడు కూడా లెక్కల ట్రిక్కులు చేయవచ్చు. 100కి దగ్గరగా ఉన్న సంఖ్యలను గుణించడం తమాషాగా చెప్పవచ్చు. ఉదాహరణకు 88ని 98చేత గుణించాలనుకోండి. నిజానికి ఇది ఏమంత సులభం కాదు. 88, 98 రెండూ 100కి దగ్గరగా ఉన్న అంకెలన్న సంగతి తెలుసు.

88, 100 కంటే 12 అంకెలు చిన్నది. 98 కేవలం 2 అంకెలు చిన్నది. ఇపుడు రెండు అంకెల్ని

88 – 12
98 – 2
-------------
86 24

...................... ......... అని రాయాలి. ఇదెలా వచ్చిందంటే..

88 నుంచి 2 తీసేస్తే 86 వచ్చింది.
12 ని 2 తో గుణిస్తే 24 వచ్చింది.

అంటే మొదటి అంకె(86) రావడానికి తీసివేతను, రెండో అంకె(24) రావడానికి గుణకారాన్ని ఒకేసారి చేశామన్నమాట. ఇపుడు 88ని 98చేత గుణించినా అదే సమాధానం 8624 వస్తుంది.

ఈ పద్ధతిని మరింత బాగా నేర్చుకోవడానికి బాగా ప్రాక్టీస్ చేయాలి. మరి క్రిందివాటిని చేయండి...

| ఎ. | బి. | సి. | డి. | ఇ. | ఎఫ్. | జి. |
|---|---|---|---|---|---|---|
| 87 | 88 | 77 | 93 | 94 | 64 | 98 |
| 98 | 97 | 98 | 96 | 92 | 99 | 97 |



# బెంజిమన్ ఫ్రాంక్లిన్

బెంజిమన్ ఫ్రాంక్లిన్ గొప్ప శాస్త్రవేత్త, తత్త్వవేత్త, ఆర్థికవేత్త, పరిశోధకుడు, రాజనీతిజ్ఞుడు. అందుకే ఆయన్ను అమెరికా ప్రజలు అంత త్వరగా మర్చిపోలేరు. అమెరికా జాతినిర్మాతల్లో ఒకరుగానే కాకుండా అమెరికా ఉత్తమ పౌరునిగా ఆయన ప్రజల మన్ననలు ఎప్పటికీ అందుకుంటూనే ఉంటారు. ఫిలడెల్ఫియాలోని బోస్టన్ నగరంలో ఫ్రాంక్లిన్ 1706 జనవరి 17న జన్మించాడు.

వర్షాకాలంలో పిడుగులతోపాటు వచ్చే భయానక వర్షం పశ్చిమ దిశ నుంచీ తూర్పుదిశకు కదులుతూంటుందని మొదట ఫ్రాంక్లిన్ కనుగొన్నాడు. మనం ఇపుడు టీవీల్లో, రేడియోల్లో వినే వాతావరణ సంబంధిత నివేదికను మొదటగా చెప్పింది బెంజిమన్ కావడం విశేషం. ఆయన తన 'పూర్ రిచర్డ్స్ ఆల్మనాక్'లో వాటిని రికార్డు చేశాడు. అంతేగాక పగలు వెలుతురును పరిమితికి మించకుండా ఉపయోగించే సమయ విధానాన్ని ఆయనే రూపొందించాడు. అలాగే బైఫోకల్స్, లైట్నింగ్ రాడ్, లైబ్రరీ కుర్చీ, ఫ్రాంక్లిన్ స్టవ్ మొదలైనవి కనుగొన్నాడు.

వీధి దీపాలు, పోస్టాఫీస్, ఫైర్ కంపెనీ, ఇన్సూరెన్స్ బెంజిమన్ ఏర్పాటుచేసినవే. ఫిలడెల్ఫియాలో పోస్టల్ విధానాన్ని ఏర్పాటు చేయడంలో ఆయన కీలకపాత్ర వహించాడు. అగ్నిప్రమాదాలు జరిగితే ప్రజలను కాపాడటానికి అందుబాటులో ఉండేట్లు 1736లోనే అక్కడ యూనియన్ ఫైర్ కంపెనీ ఏర్పాటుచేశాడు. 1752లో అమెరికాలో తొలి ఫైర్ ఇన్సూరెన్స్ కంపెనీ నెలకొల్పాడు. అంతేగాక రాత్రిపూట ఫిలడెల్ఫియాలో ప్రశాంతతను రక్షించడానికి నైట్ వాచ్, మిలిషియా అనే సంస్థను ఏర్పాటుచేసి రాత్రుళ్లు కాపలాకాసేవారిని నియమించాడు. ఆకాశమార్గంలో బెలూన్ల ద్వారా తపాలా పంపడాన్ని కనుగొన్నాడు. 1731లో అమెరికాలో తొలి సర్క్యులేషన్ లైబ్రరీని ఏర్పాటు చేసి ప్రజలు పుస్తకాలు అద్దెకు తీసుకుని చదివేందుకు వీలుకల్పించాడు.

బెంజిమన్ ఫ్రాంక్లిన్ 1790లో మరణించాడు.



నీలిరంగు తిమింగలం 188 డెసిబుల్స్ శబ్దం చేస్తుందిట. ఇది 530 మైళ్ల వరకూ గుర్తించవచ్చుట. ఇంతకంటే పెద్ద శబ్దం ఏ జీవీ చేయలేదు.

అన్నింటికంటే ప్రమాదమైనది ఈగ. ఇది అన్ని మురికి, దుమ్ముధూళి ప్రదేశాల్లో తిరుగుతూంటుంది. కనుక సాధారణంగా ఇళ్లలోకి వచ్చే ఈగ వాలే ఆహారపదార్థాలను తినకుండా ఉండటమే మంచిది.



సాల్మండర్ ప్రపంచంలోని జీవాల్లోకెల్లా పెద్ద ఉభయచరజీవి. ఇది ఐదు అడుగులు పెరుగుతుంది.



వందసంవత్సరాల క్రితం మొదటి వైరస్‌ను మొక్కల్లో, జంతువుల్లోనూ కనుగొన్నారు.



ఆర్మేనియాలో సుమారు 50ఏళ్లక్రితం ఆడబల్లుల్ని పెద్ద సంఖ్యలో కనుగొన్నారు.

మనిషి కనురెప్పలు కొట్టుకుంటుంటాయి. ఇది సంవత్సరానికి 4కోట్ల 2లక్షలపర్యాయాలు జరుగుతుందిట!

వ్యోమగాములు అసలు ఎత్తుకంటే 1.5నుంచి 2.25 అంగుళాలు పెరిగారు. భూమ్యాకర్షణ శక్తి అస్సలు లేని ప్రాంతానికి వెళ్లడంతో వారి వెన్నెముక తిన్నగా, బలంగానూ మారడమే అందుక్కారణం!





ప్రపంచంలోకెల్లా అతిపెద్ద టెలిస్కోప్‌ను ఉత్తర చిలీలో నిర్మించారు.

సుమారు 40ఏళ్ల క్రితమే కంప్యూటర్ మౌస్‌ను కనుగొన్నారు.



అమెరికా తొలి స్పేస్‌స్టేషన్ స్కైలాబ్ 1979లో వేలాది ముక్కలై భూమిమీద పడింది. అదృష్టవశాత్తూ ఎక్కువ భాగం సముద్రంలోనే పడ్డాయి.



70 మిలియన్ల ఏళ్ల క్రితం టెరోసర్ అనే పెద్ద పక్షి ఉండేది. ఆకాశంలో ఎగిరేటపుడు దాని రెక్కలు సుమారు 39 అడుగులు విస్తరించేవి.



మానవశరీరంలో అతి చిన్న ఎముక చెవి ఎముక. ఇది సుమారు 0.28 సెంటీమీటర్ల పొడవు ఉంటుంది.



Kids Zone

# పద ప్రయాణం

నిర్వహణ: కలియుగం హుమాయున్ సఫీర్




## పజిల్‌కి... ఆధారాలు

**అడ్డం**

ఎ. చీమలదండు ఎదురొచ్చింది (2)

డి. కాంతి కిరణాలలో ఉండే శక్తిని ఏమంటాము? అటుగా (3)

ఇ. నిష్కాంతి చర్యలో ఏర్పడే అంత్య పదార్థం (2)

జి. పరుగు ఆంగ్లంలో (2)

హెచ్. మైదా రొట్టె ఎదురొచ్చింది (2)

జె. యంత్రం అటుగా (2)

కె. ఓ కూరగాయ ఎదురుగా వచ్చింది (3)

ఎం. ప్రోటీన్ల తయారీకి కావాల్సిన ముఖ్యమైన పదార్థాలు (6)

పి. మైట్రోకాండ్రియాలో ఉండే లోపలి భాగం ఇది (3)

ఆర్. ఆకుకూరల్లో ఓ భాగం (2)

ఎస్. '.........వాడిన' పూరించండి అంతే (2)

యు. ముస్లిం మత గురువునేమంటారు'2)

వి. ఆవర్ణికలోని థైలకాయిడ్ దొంతరలనేమంటాము? ఎదురుగా వచ్చింది (2)

డబ్ల్యు. '...దోస?' పూరించండి (2)

**నిలువు**

ఎ. భూమ్యాకర్షణ శక్తిని కనుగొన్న సిద్ధాంతం (3)

బి. 'మనోబలం' యథాలాపంగా అస్తవ్యస్తమైంది.(4)

సి. 'బృందగానం' మరోలావచ్చి చిన్నాభిన్నమైంది (3)

డి. 'స్ట్రయికర్' ఉండే గేమ్ పైకి పాకింది (3)

ఎఫ్. 'మజ్‌మా' యథాతథంగా చెదిరినది (3)

హెచ్. ఆకాశం ఎదురెక్కింది (2)

ఐ. మాడినట్లయిన ముఖం. క్రిందుగా.. (2)

ఎల్. అందమైన (2)

ఎం. '... కత్తెర' పూరించండి (2)

ఎన్. కిరణజన్యసంయోగక్రియలో పత్రహరిత రేణువు వీటికి చెందుతుంది (6)

ఓ. వస్త్రం మరోలా '....వ? చివర లేదు (2)

క్యు. రాజుయొక్క అసిస్టెంట్ పైకి కిందుగా (2)

ఆర్. కార్బన్‌డయాక్సైడ్ స్థాపనలో జరిగే చర్యల వలయాన్ని '.. వలయ'మంటాం (3)

టి. ముక్కు మరోలా చెదిరింది (3)

## థాట్స్ ఆఫ్ చింటూ..!

- లెక్కల మాస్టారి సైకిల్ పాడుచేసేవాడే లేదా!?
- డిఇఓ ఉన్నప్పుడు టీచర్లు చేసే నటన రోజూ చేయొచ్చుగా!
- జ్ఞానం అవసరం, ర్యాంకులు కాదు!
- స్కూలే పెద్ద రోలు, ట్యూషన్ల పేరుతో రుబ్బురోళ్లెందుకు?
- నాన్న కాలంలో పుట్టినా బాగుండేది!

# 3 శాస్త్రాలు + 3 లక్షణాలు + 7 అంశాలు = 100% చేతిరాత

విద్యుత్తు, పనిచేసే బల్బు, స్విచ్ నుంచి బల్బ్ దాకా అంతరాయంలేని తీగె... వీటిలో ఏ ఒక్కటి తక్కువైనా వెలుగు దూరమవుతుంది. అలాగే చేతిరాత కూడా! మామూలు చేతిరాత వేరు; మనసు దోచుకునే చేతిరాత వేరు. పదికాలాలపాటు నిలిచిపోయే చక్కనైన చేతిరాతకు ఉపకరించే మూడు శాస్త్రాలను, మూడు లక్షణాలను, ఏడు అంశాలను గమనిద్దాం. వీటిలో ఏ ఒక్కటి లోపించినా చేతిరాత కుంటుపడడం ఖాయం.

### మూడు శాస్త్రాలు:

1. కాలిగ్రఫీ: కాలిగ్రఫీ అంటే అందమైన చేతిరాతకు సంబంధించిన శాస్త్రం. ముచ్చటేసే ముత్యాల్లాంటి అక్షరాలు చూస్తే మనసుకెంత హాయిగా ఉంటుంది! అలాంటి ఆకర్షించే అక్షరాల వెనుక దాగివుండే రహస్యాలను వెల్లడించి, కళ్ళను కట్టిపడేసే చేతిరాతను వేళ్ళలోంచి జాలువారేలా చేసే ఆర్ట్ పేరే కాలిగ్రఫీ.

2. గ్రాఫాలజీ: ఒక వ్యక్తితో ఏమాత్రం పరిచయం లేకపోయినా కేవలం చేతిరాత చూసి ఆ వ్యక్తి మంచి, చెడు లక్షణాలను, మనస్తత్వాన్ని విశేషించే శాస్త్రం. ఈ భూతలం మీద ఏమనిషీ పూర్తి ఉన్నత లక్షణాలను లేదా కేవలం అధమ లక్షణాలను మాత్రమే కలిగి ఉండే అవకాశం లేదు. మంచి చెడుల సమాహారమే మానవ మనస్తత్వం. మనల్ని మనం అద్దంలో చూసుకుంటున్నట్లుగా మనలోని అన్ని గుణగణాలనూ నిగ్గు తేల్చి మరీ చూపిస్తుందీ గ్రాఫాలజీ అనే సైన్స్.

3. గ్రాఫో థెరపీ: అక్షరాలు, పదాలు, వాక్యాల మధ్య దూరం; వాటి పరిమాణం; ఆకారం; ఒత్తిడి.. ఇలాంటి పలు విషయాల్లో చిన్నపాటి మార్పులు చేసుకుని, అభ్యాసం చేసి, ఆ మార్పులతో కూడిన చేతిరాతను అలవాటుగా మార్చుకుంటే తదనుగుణమైన మార్పులు మనస్తత్వంలో చోటుచేసుకుంటాయని శాస్త్రీయంగా నిర్ధారించిన సైన్సే గ్రాఫో థెరపీ.

### మూడు లక్షణాలు:

1. స్పష్టత : ఉత్తరాలు, పరీక్షలు వంటి కీలకమైన విషయాల్లో మన చేతిరాత మన పరోక్షంలో చదవబడుతుంది. అంటే.. అది కచ్చితంగా స్పష్టంగా ఉండి తీరాలి. అక్షరాల్లో స్పష్టత లోపిస్తే ఒకసారి ఒక మార్కు, మరోసారి ఒక లక్ష, ఇంకోసారి ఒక జీవితం.. ఇలా ఏదైనా కోల్పోవచ్చు! అస్పష్టమైన చేతిరాత అసంపూర్ణ విద్యకు సంకేతమంటారు జాతిపిత గాంధీ.

2. అందం : 'అందమె ఆనందం' అన్నారుగదా పెద్దలు. మనం రాసింది మనమే చదివినా, మరొకరు చూసినా ఆహ్లాదంగా ఉండాలి. మనమే చదివితే ఇంకాసేపు చదవాలని, మరోసారి చదవాలని అనిపించాలంటే అక్షరాలకు అందం అవసరం. మన రాత వేరొకరు చూసినప్పుడు రాసిన విషయం మీద మనకున్న శ్రద్ధ, ఎవరిని ఉద్దేశించి రాశామో వారి పట్ల మనకున్న గౌరవాభిమానాలను తేటతెల్లం చేసే లక్షణం అక్షరాల అందం.

3. శాస్త్రీయత : ఇన్నేళ్ళూ అక్షరాలు స్పష్టంగా, అందంగా ఉంటే చాలనుకునేవాళ్ళం. గ్రాఫాలజీ, గ్రాఫో థెరపీ అనేకశాస్త్రాల మీద అవగాహన... తద్వారా ఉద్యోగ నియామకాల్లోనూ, నేర పరిశోధనలోనూ అక్షరాల శాస్త్రీయతను ఆధారం చేసుకునే నిర్ణయాలు తీసుకునే రోజులివి. స్పష్టమైన, అందమైన చేతిరాతతో భావ ప్రకటన, ఆకర్షణ సాధించవచ్చు. శాస్త్రీయతతో సానుకూల దృక్పథాన్ని పెంపొందించుకుంటూ, ప్రతికూల మనస్తత్వాన్ని పారద్రోలవచ్చు.

కాలిగ్రఫీ, గ్రాఫాలజీ, గ్రాఫో థెరపీలను ఆధారం చేసుకుని మన చేతిరాతను అస్పష్టంగా, అందంగా, శాస్త్రీయంగా చేసుకుందాం.

ఈ మూడు అంశాలనూ ఒకేసారి అమలుచేస్తూ ఆంగ్లంలో ఓ పదిలైన్లు రాయండి. తేడా మీకేతెలుస్తుంది. అదేచేతిరాతలో కచ్చితంగా ఉండవలసిన మరో ఏడు అంశాల గురించి ఇప్పుడు చూద్దాం..

### ఏడు అంశాలు:

1. చెయ్యి, కలం, కాగితాలు ఉన్న తీరు
2. అక్షరాల ఆకారం
3. అక్షరాన్ని మరో అక్షరంతో కలపడం
4. అక్షరాల ఎత్తుపల్లాలు
5. అక్షరాలు, పదాలు, వాక్యాల మధ్య దూరం
6. అక్షరాల వంకర
7. అక్షరాల ఒద్దిక చూపే

బేస్‌లైన్

సాధారణమైన చేతిరాతను అసాధారణమైనదిగా చేసుకోవడానికి మూడు శాస్త్రాలు, మూడు లక్షణాలు, ఏడు అంశాల మీద అవగాహన ఎంతైనా దోహదపడుతుంది.

వీటన్నింటి వివరణ...

**వచ్చే సంచికల్లో.**



# గణితబోధన: వాస్తవాలు, సవాళ్ళు

- ఏక్తా శర్మ

1 + 1=2
2+2=4
4+4=8
8+8=16

"గణితం గురించి చాలా తెలుసుకోవడం కంటే గణితపరం చేయడమెలా అన్నది తెలుసుకోవడమే ఎంతో ఉపయోగకరం" అని అన్నారు ప్రముఖ గణితవేత్త డేవిడ్ వీలర్. అసలు గణిత బోధన- అభ్యసనలోని సమస్యంతటిని ఆ ఒక్కమాట చెబుతుంది. ఒక సమస్యను పరిష్కరించేందుకు నేర్చుకున్న కొన్ని విధానాలను అనుసరించి పలురకాలుగా సమాధానాన్ని రాబట్టేందుకు గణితం గురించిన జ్ఞానం ఉపకరిస్తుంది. గణితపరం విషయానికి వస్తే.. ఆ సందర్భంలో అవసరానికి తగిన గణితాన్ని సమర్థంగా అమలుచేయడం. ఎంతో వివరణలతో కూడిన సమస్యల పరిష్కార సందర్భంలో ఈతరహా అవకాశం వస్తుంది. తరగతిలో ఉపాధ్యాయుడు, విద్యార్థి కలిసి చర్చించుకునే అవకాశం కల్పించేదిగా గణితాన్ని పరిశీలిస్తూ ఈ రకమైన బోధన ఇద్దరికీ ఉపయోగపడుతుందని చెప్పగలిగే ప్రయత్నం చేద్దాం.

**ఎక్కువ పదాలతో ఉండే సమస్యలు:**

"సీమ కొంతడబ్బుతో మార్కెట్‌కు వెళ్ళింది. ఆమె రూ.150పెట్టి పండ్లు కొన్నది. ఇపుడు ఆమె వద్ద వందరూపాయలు మిగిలాయి. సీమ మార్కెట్‌కు వచ్చినపుడు ఎంత డబ్బు తీసుకువచ్చింది?"

ఇలా పదాలతో సమస్యను ఇచ్చినపుడల్లా దీన్ని ఏ పద్ధతిలో చేయాలో తెలియక విద్యార్థులు తికమక పడుతుంటారు. పిల్లలు ఎందుకు కంగారు పడుతున్నారన్న విషయాన్ని అర్థం చేసుకోగలిగితే ఇలాంటి వివరణాత్మక సమస్యలను చేయడంలో వారు ఎదుర్కొనే సవాళ్ళను గుర్తించగల్గుతాం. ఒక్కోసారి ఇలాంటి సమస్యలకు అనుసరించాల్సిన పద్ధతి కూడిక, తీసివేత, మొదలైనవి.. తేల్చుకోవడానికి పిల్లలు "ఎన్ని/మొత్తం ఎంత" లేదా "ఎన్ని/ఎన్ని మిగిలాయి" వంటి పదబంధాల్ని వాడుతుండటం గమనిస్తుంటాం. ఇపుడు పైన ఇచ్చినది చూసిన పిల్లలు తప్పకుండా తీసివేత వైపే మొగ్గుతారు. అలా పదబంధాల్ని ఏర్పరచుకోవడంతోపాటు, అసలు ఆ లెక్క సందర్భాన్ని, సమస్య ఏర్పడటాన్ని పిల్లలు మరో పెద్ద సవాలుగా తీసుకుంటారు. కొన్నిసార్లు పిల్లలకు అది అసందర్భంగా ఉంటే, ఇలాంటి వివరణాత్మక సమస్యల పరిష్కారంలో ఉండే సరదాపోయి, మొత్తం పరిష్కార మార్గమంతా మెకానికల్‌గా తయారవుతుంది.

**మరో ఉదాహరణ:**

"3వ తరగతి గణితపాఠ్యపుస్తకంలో 86 పేజీలు, తెలుగు పాఠ్యపుస్తకంలో 75పేజీలు ఉన్నాయి. రెండు పాఠ్యపుస్తకాల్లోనూ కలిపి మొత్తం ఎన్ని పేజీలు ఉన్నాయి?"

ఆ రెండు పాఠ్యపుస్తకాల్లో కలిపి మొత్తం ఎన్ని పేజీలున్నాయన్నది ఆలోచనాపరులైన వారెవ్వరైనా తెలుసుకోవాలని ఎందుకు అనుకుంటారు? దీనికంటే కాస్తంత వాస్తవికంగా ఉండే సందర్భాన్ని పేర్కొనవచ్చు. అపుడు విద్యార్థి ఆ లెక్కను అర్థవంతంగా పరిష్కరించాలన్న ఆసక్తి ప్రదర్శిస్తాడు. ఇంకో ఉదాహరణ.. "దీపకు తన రోజువారీ ఖర్చులు రాసుకోవడం అలవాటు. ఇవాళ ఆమె పండ్లు కొనడానికి రూ.86, కూరగాయలకు రూ.75 ఖర్చుచేసింది. ఇవాళ మొత్తం ఆమె చేసిన ఖర్చు ఎంతో లెక్కగట్టడంలో ఆమెకు సహకరించండి."

ఈ ఉదాహరణలో ఉపయోగించిన సందర్భానుచిత 'భాష'ను కాస్తంత పెంచితే, సమస్య ప్రస్తావన మొత్తం ఒక అర్థవంతమైన లెక్కగా మారుతుంది. స్పష్టమైన పదాల్లో పేర్కొన్నప్పటికీ, ఇటువంటి భాషతో కూడిన సమస్యలు గణితాన్ని చూసే, బోధించే, నేర్చుకునే మార్గాన్ని ముఖ్యంగా ప్రాథమికస్థాయిలో ఎంతో మారుస్తోంది. బోధనాభాష సమస్యలు ప్రాథమికస్థాయిలో పిల్లలు పదాలతోకూడిన లెక్కల పరిష్కారంలో సవాళ్లను ఎదుర్కొంటుండవచ్చు. అయితే దీనిలో ఇతర సమస్యలూ ఉన్నాయి. చాలా సందర్భాల్లో, భాషపై పట్టు ఉన్న విద్యార్థులు కూడా ఇటువంటి లెక్కల్ని చేయడంలో ఇబ్బంది పడుతుంటారు. అంటే సమస్య బోధనా మాధ్యమానికంటే మరింత లోతైనదన్నది స్పష్టమవుతోంది. ఈ అంశాన్ని విస్తారంగా తెలుసుకునేందుకు చిన్నపాటి ఉదాహరణలు తీసుకుందాం.

24
\+ 32 ..... 24 + 32 = .... 24, 32 కూడితే ...
...........
...........
(1) (2) (3)

ఇందులో మొదటి రెండుభాగాలు గణిత సింబల్స్‌తో కూడినవి కాగా, మూడవది సంపూర్ణ గణిత భావనకు చెందినది. మూడవది 1, 2 భాగాలకు పదాల వ్యక్తీకరణ.

1వ భాగంలో పేర్కొన్నది సహజంగా దేశంలో లెక్కలు నేర్చుకునేవారు కూడికలు చేయడానికి అనుసరించే సాధారణ పద్ధతి.

2వ భాగంలో '=' అనే సింబల్ పెట్టడంతో కొద్దిగా మారింది. కానీ దాన్ని గణిత పరిభాషలో చదివితే ("ఇరవైనాలుగుకి ముప్పైరెండు కూడితే..) సమస్య చాలా స్పష్టమవుతుంది (1వ భాగంలో కంటే). 1వ భాగంలో పిల్లలు మాట్లాడుకోవడం, 2వ భాగంలో అస్సలు మాట్లాడుకొనకపోవడం లేదా అర్థంచేసుకోలేక పోవడంగానీ, రెండు విధానాల్ని కలగల్పడమో.. ఒకట్ల స్థానంలో ఉన్నవాటిని పదుల స్థానంలోవాటికి కలపడం ... గమనించవచ్చు. అంటే విద్యార్థి ఎదుర్కొనే ఇబ్బంది లెక్కను అడిగిన మాధ్యమానికి సంబంధించినది మాత్రమే కాదని ఇది తెలియజేస్తుంది. చాలా స్పష్టంగా పూర్తిగా గణితపరంగా సమస్యను పేర్కొన్నప్పటికీ పిల్లలు అర్థం చేసుకోవడంలో ఇబ్బందులు ఎదుర్కొంటుంటారు కూడా.

3వ భాగం భిన్నమైన స్థితి. ఇందులోనూ భాషను ఉపయోగించారు. కానీ ఇది మనం రోజువారీ జీవితంలో వాడేది కాదు. ఇందులో 1, 2 భాగాల్లోని అమూర్తీకరణ కూడా ఉంది. కానీ అదేసమయంలో సమస్యకు పరిష్కారం సాధించే పద్ధతినీ పేర్కొంది. ఇందులో గణితసంబంధ పదాలతో భావవ్యక్తీకరణ జరిగింది. ఉదాహరణకు 'కలపండి' లేదా కొన్నిసందర్భాల్లో '2,2 కలిపితే 4' అని. బోధనామాధ్యమంగా ఉపయోగించే భాష ఇక్కడ తెలుగు కనుక అటువంటి పదాలు ఆ భాషకు సంబంధించినవిగా పేర్కొనబడవు. ఇవి గణితపరిభాషపదాలు. కానీ చాలా పర్యాయాలు మనం ఈ కీలకాంశంపై దృష్టిపెట్టం. ఇవి గణితభాషాపరమైన భావాన్ని చెప్పడానికి

ఉపయోగించేవంటివి. పిల్లలు గణితపరంగా మాట్లాడేందుకు ఈ పదాలను పరిచయం చేయకపోవడంవల్ల వాటితో కూడిన లెక్కలు పిల్లల్ని మరింత గందరగోళపరుస్తుంటాయి. సంబంధిత సింబల్స్‌తో గణితం కూడా ఒక భాషవంటిదేనని గుర్తించాల్సిన అవసరం ఉంది. అలాగే ఇతర భాషల్లానే గణితానికి ఆ సింబల్స్ డీకోడ్ చేసుకోవడమేకాకుండా అర్థవంతమైనదిగానూ చేసుకోవచ్చన్నదీ గ్రహించాలి. కేవలం సింబల్స్, లెక్క చేసే విధానాలు తెలిస్తే లెక్కించేందుకు వీలుకలుగుతుంది; కానీ ఆ సమస్యను పూర్తిగా అర్థంచేసుకోగల అవకాశాలు కల్పించనంతవరకూ వారు గణితపరంగా ఆలోచించలేరనే అనాలి.

## కీలకాంశాలు

పదాలతో, వివరాలతో ఉన్న లెక్కల్ని చేయడంలో పిల్లలు ఎందుకు ఇబ్బంది పడతారు?

అభ్యాసంలో దేన్నయినా సంపూర్ణంగా అర్థంచేసుకోవడమే కీలకాంశమని ఎన్‌సిఎఫ్ 2005 స్పష్టంగా పేర్కొంది. నేర్చుకోవడంలో అర్థం చేసుకోవడమన్నది సహజమైన శాశ్వతంగా కనిపించే ముందస్తు నిబంధన అని ఎన్‌సిఎఫ్ వాదన. పిల్లలకు గణితాన్ని పరిచయం చేయడం, బోధించడం ఈ నిబంధనపరంగా జరుగుతుందీ లేనిదీ పరిశీలిద్దాం. ప్రభుత్వ పాఠశాలల్లో ఉపయోగించే పాఠ్యపుస్తకాల్లోంచి కొన్ని ఉదాహరణలు తీసుకుంటే గమనించిన అంశాలు...

1. పెద్ద లేదా చిన్న పాట్రన్స్ గుర్తించడం, ఒకేలక్షణాల గుర్తింపు మొదలైన గణిత భావాలకు తగిన స్థానం కల్పించలేదు.
2. కల్పించిన చోట కూడా సంఖ్యలను అర్థం చేసుకునేందుకు సవ్యంగా వినియోగించలేదు.
3. సంఖ్యను, దానికి సంబంధించిన పదాన్ని ఉదాహరణకు '3', 'మూడు'ని వెంటవెంటనే పరిచయం చేశారు.
4. రోజువారీ జీవితానికి సంబంధించినవి అంత సక్రమంగా, పటిష్టంగానూ లేవు.
5. పాఠ్యపుస్తకాల్లో సూత్రాలకిచ్చిన ప్రాధాన్యత ప్రాక్టీస్‌కు ఇవ్వలేదు. ఇది సిద్ధాంతాలను అర్థం చేసుకునేందుకు మంచి ప్రయత్నమైనప్పటికీ, వర్క్‌బుక్ వంటి ప్రత్యామ్నాయ ప్రాక్టీస్ మెటీరియల్ లోటుతో పిల్లల అభ్యసనపై వ్యతిరేక ప్రభావం పడే అవకాశమే ఉంది. (గణిత అభ్యసనలో ప్రాక్టీస్‌ను కూడా చేర్చడం మంచిదని నా సూచన). అసలు గణితం అంటేనే ఆలోచనను, రీజనింగ్‌ను పెంపొందించుకోవడానికి సంబంధించినది, అందువల్ల సమస్యాపరిష్కారంలో ప్రాక్టీస్ అత్యంత అవసరం.




బోధన, అభ్యసనకూ పాఠ్యపుస్తకాలు గైడ్‌వంటివన్నది నిజమైతే, గణితబోధనపైన పేర్కొన్న అంశాలతో రూపొందించబడిందని అనడం అర్థవంతమే అవుతుంది. పదాలు వివరాలతో ఉన్న సమస్యలు 2వ భాగంలోవలె కొద్దిపాటి మార్పులతో ఉన్నవాటికంటే 1వ భాగంలోవలె అల్గరిథమ్ ఆధారిత సమస్యల్ని పిల్లలు బాగా చేస్తారన్నది ఎంతో నిజం. అసలు గణితాన్ని ఒక సబ్జెక్టుగా భావించి అర్థం చేసుకోలేక పోవడంతోనే ఇబ్బందులు తలెత్తుతున్నాయన్నది గ్రహించవచ్చు. ఒక గణితసమస్యకు సరైన సమాధానం రాబట్టేందుకు అనుసరిస్తున్న విధానాలపై ఒత్తిడితో కీలకాంశం తారుమారైనట్టుంది. ఇచ్చిన సమస్యను పరిశీలించేందుకు, పలు పరిష్కారమార్గాలు గుర్తించేందుకు, చిన్నపాటి అల్గరిథమ్ ఆధారితమైనది విధానమైనా గుర్తించేందుకు, సమస్య వెనుక రీజన్ లేదా లాజిక్‌కు తగ్గట్టుగా అనుసరించే పద్ధతిని అమలుచేయడానికి విద్యార్థికి వీలుకల్పించడం లేదు.

## కార్టూన్ కార్నర్












## ముందుచూపు



ఏ భాషనైనా నేర్చుకోవడానికి సందర్భోచితం చేయడం ఎంతైనా అవసరం. గణితం కూడా ప్రాథమికస్థాయిలో పిల్లలకు పరిచయంచేసేటపుడు అదే పద్ధతిని అనుసరించాలి. గణితాన్ని సందర్భ పరంచేయాలి. వాస్తవ సమస్యస్థితి ఏర్పరి చేందుకు బోధన, అభ్యసనలను క్రమబద్దీ కరించాలి. పిల్లలకు సమస్యనిచ్చి సరైన సమాధానం రాయండి అని అడిగేకంటే, సమాధానం రాబట్టేందుకు పలుమార్గాలు అన్వేషించేందుకు వారిని ఉత్సాహపరచాలి. ఇందుకు వివరాలతోకూడిన సమస్యలను చర్చించేందుకు వీలు కల్పించేవిగా ఉండేట్టు చూడాలి. ఉదాహరణకు పిల్లల్ని చిన్నపాటి కూడిక చేయమని అడిగేకంటే, వారికి ఇచ్చిన సంఖ్యలను కలిపేందుకు మూడు మార్గాలు చెప్పమని అడగాలి; లేదా వారికి ముందే సమాధానాలు ఇచ్చి వాటికి ప్రశ్నలు రాయమనాలి.

ఇలాంటి చర్చలు, సంప్రదింపులతో కూడిన కృత్యాలు గణిత తరగతుల్లో ప్రవేశపెట్టాలి, తద్వారా పిల్లలకు మరింత అభ్యసన అనుభవం కలిగే అవకాశం ఉంది.

అభ్యసన సమయాల్లో ఎక్కువగా వివరణాత్మకమైనదిగా ఉపయోగించడంతో గణిత అభ్యసన పెద్ద సవాలుగానే ఉంది. అందువల్ల చాలామంది విద్యార్థుల్లో భయాందోళనలు కలిగి ఊహించని నిర్ణయాలు తీసుకుంటున్నారు. గణితం సవాళ్లను ఎదుర్కొనగల శక్తిసామర్థ్యాలు కొందరు పిల్లల్లో లేవని ఉపాధ్యాయులే భావిస్తున్నారు. బాలుర వలె బాలికల్లోనూ చాలామంది గణితాన్ని సులభంగా నేర్చుకోగల సత్తా లేదన్నది సాధారణంగా వింటున్న వాదనే. ఇలాంటి నమ్మకాలన్నీ నిరాధారాలే. ప్రతి పిల్లవాడు గణితాన్ని నేర్చుకోగలడని, పిల్లలందరూ గణితాన్ని తప్పకుండా నేర్చుకోవాలని మనం అందరం ముఖ్యంగా గమనించాలి.

గణితబోధనకు కావాల్సిందల్లా పిల్లలు సమస్యల అర్థాన్ని తెలుసుకునేలా చేయడం, వారిని తికమకపెట్టేవిధంగా బోధించకుండా ఉండటం. గణితం నేర్చుకునేవారికి సబ్జెక్టును తగినవిధంగా చెప్పడం విషయంలో ప్రముఖ గణితవేత్త బ్రూనర్ మాటలు గుర్తుచేసుకోవాలి.. "పిల్లల అభివృద్ధి క్రమంలో ఏ స్థాయిలోనైనా గణితాన్ని ఎంతో తెలివిగా, నమ్మకంతో, ప్రభావితంగా బోధించవచ్చు." ◆






# పాఠశాల అభివృద్ధిలో

# అకడమిక్ మానిటరింగ్



స్కూలులో చదివే చిన్నారులందరూ చక్కగా చదవడం, రాయడంతోపాటు, పాఠశాల సజావుగా నడవడానికి అవసరమైన భౌతిక వనరుల్ని సమకూర్చుకోవడానికి సమాజంలోని అనేక వర్గాల సహాయ సహకారాలు ఎంతో అవసరం. సమాజం, పాఠశాల రెండూ వీటి విషయంలో ఉమ్మడి బాధ్యత వహించాల్సి ఉంటుంది. అందుకే విద్యార్థుల సర్వతోముఖాభివృద్ధికి, పాఠశాల సజావుగా సాగేందుకు పిల్లల తల్లిదండ్రులు, ఉపాధ్యాయులతో కలిసి ప్రతి పాఠశాలలో 'అకడమిక్ మానిటరింగ్ కమిటీ'ల్ని ఏర్పాటు చేస్తున్నారు.




### ఈ కమిటీలు ఎందుకు?

బడిలో చేరిన పిల్లలు చదవడం, రాయడం, కూడికలు, తీసివేతలు, గుణకారం, భాగహారం వంటివి చేయగలగాలి. వీటిని పిల్లలు చేయగలుగుతున్నారా? లేదా? అని పట్టించుకున్నప్పుడే వారికి మంచి చదువు అందుతుంది. ఇందుకోసం విద్యార్థుల తల్లిదండ్రులే పాఠశాల నిర్వహణ, విధివిధానాల రూపకల్పనలో భాగస్వాములై సహకరిస్తే, అది మంచి ఫలితాల్ని ఇచ్చే సంస్థగా ఎదుగుతుంది. ఆ బడిలోని చదివే చిన్నారులకు మంచి చదువు లభిస్తుంది. అందుకే... పిల్లల తల్లిదండ్రులు బడి కార్యక్రమాల్లో పాల్గొనేలా, బడికి కావాల్సిన సహాయ సహకారాలు అందించేందుకు ఈ కమిటీల్ని ప్రతి పాఠశాలలో ఏర్పాటు చేస్తున్నారు.

### ఇందులో సభ్యులు

- కమిటీకి గ్రామసర్పంచ్ / కౌన్సిలర్ అధ్యక్షుడుగా ఉంటాడు.
- పాఠశాలలోని అన్ని తరగతుల పిల్లల తల్లిదండ్రుల నుంచి సభ్యుల్ని ఎంపిక చేస్తారు. వీలైనంత మేరకు తల్లులను సభ్యులుగా చేర్చుకుంటారు.
- ఒక్కొక్క తరగతిలో బాగా చదివే విద్యార్థి తల్లి/తండ్రి, చదువులోవెనకబడిన విదార్థి తల్లి/తండ్రి సభ్యులుగా ఉంటారు.
- పాఠశాల ప్రధానోపాధ్యాయుడు ఈ కమిటీకి మెంబరు – కన్వీనర్‌గా ఉంటాడు.

### కమిటీ బాధ్యతలు:

- బడి ఈడు పిల్లలందరినీ స్కూల్లో చేర్చడం, బడి బయట పిల్లలు కూడా బడిలో చేరేలా చూడటం.
- పిల్లలు క్రమం తప్పకుండా పాఠశాలకు వచ్చేలా చూడడం.
- ప్రార్థనా సమయానికి పిల్లలు, ఉపాధ్యాయులు బడికి హాజరయ్యేలా చూడడం.
- ప్రతి నెల మొదటివారంలో తల్లిదండ్రులతో సమావేశం నిర్వహించడం.
- బడిలో ఎంతమంది పిల్లలు చదవడం, రాయడం, లెక్కలు చేయగల్గుతున్నారో తల్లిదండ్రుల ముందు ప్రదర్శించడం.
- చదువులో వెనకబడ్డ పిల్లల పురోగతికి కార్యచరణ ప్రణాళిక రూపొందించడం.
- పిల్లలు రోజూ రాసే డైరీ, స్కూలు పోస్టుబాక్స్ నిర్వహణ పరిశీలన.
- స్కూలు లైబ్రరీల్లోని పుస్తకాల్ని పిల్లలు రోజూ చదువుతున్నారా లేదా గమనించడం.
- గోడ పత్రికలో పిల్లలు రాసిన అంశాల్ని ప్రదర్శించారా లేదా చూడటం.
- పాఠశాలకు వచ్చిన వివిధ గ్రాంటుల్ని అవసరానికి తగ్గట్టుగా వినియోగించు కున్నారా లేదా తనిఖీ చేయడం.
- స్కూలులో తాగునీటి సౌకర్యం, మరుగుదొడ్లు/మూత్రశాలలు సక్రమంగా పనిచేసేట్లు చూడడం.
- పాఠశాలలోని రేడియో, టీవీ, కంప్యూటర్ వంటి పరికరాల్ని పిల్లలకు అందు బాటులోకి తేవడం.
- పిల్లలకు మంచి మధ్యాహ్న భోజనం పెడుతున్నారా లేదా చూడడం, వారి అభిప్రాయాల్ని తెలుసుకోవడం.
- గ్రామస్థులు, చదువుకున్న యువతీయువకులు, ప్రజాప్రతినిధులు, స్వచ్ఛంద సంస్థలు, గ్రామైక్య సంఘాలు, స్వయం సహాయక బృందాలు, ఉపాధ్యాయుల సహకారంతో బడికి కావల్సిన భౌతిక వనరుల ఏర్పాటుకు కృషి
- బడిబాట, గ్రంథాలయ వారోత్సవాలు, మేళాలు, బాలల దినోత్సవ వేడుకలు, సామూహిక అక్షరాభ్యాసం వంటి కార్యక్రమాల్లో పాల్గొని సహకరించడం.



బడిలో పిల్లలు

## ఏం చేయగలగాలి?

- వార్తాపత్రికలు, కథల పుస్తకాలవంటివి గొణగకుండా ధారాళంగా చదవాలి.
- తప్పులు లేకుండా డిక్టేషన్ రాయగలగాలి.
- ఏదైనా తెలిసిన విషయం గురించి ఒకట్రెండు పేరాలు తప్పులు లేకుండా రాయగలగాలి. చదివిన దాన్ని వారి సొంత మాటల్లో చెప్పగలగాలి.
- రోజూ డైరీ రాయాలి.
- సైన్స్ పాఠాల్లోని బొమ్మల్ని గీసి, భాగాల్ని గుర్తించాలి.
- మన గ్రామం, జిల్లా, రాష్ట్రం పటాలు గీయగలగాలి.
- జిల్లాలు, పట్టణాలు, రాష్ట్రాలు, నదులు, సరిహద్దులు, దిక్కులు గుర్తించాలి.

# కొరియాలో

# ప్రాథమికవిద్య తప్పనిసరి

దక్షిణకొరియాలో పాఠశాల విద్యావిధానం 6-3-3-6 క్రమంలో ఉంది. ఇందులో ప్రాథమిక పాఠశాల (1-6గ్రేడ్), మిడిల్‌స్కూల్ (7-9గ్రేడ్), హైస్కూల్ (10-12 గ్రేడ్) వరకు ఉంటాయి. ఆ పై కాలేజీలు, విశ్వవిద్యాలయాలు ఉంటాయి. దేశంలో 6-11 ఏళ్ల వయసు పిల్లలందరికీ ప్రాథమిక విద్య తప్పనిసరి. 12-13 ఏళ్ల పిల్లలు మిడిల్‌స్కూల్‌లో మూడేళ్లపాటు లోయర్ సెకండరీ విద్యనభ్యసిస్తారు. ఇక హైస్కూల్ విద్య 15-17ఏళ్ల వయసువారికి మూడేళ్లు ఉంటుంది. హైస్కూల్ పూర్తిచేసినవారు ఉన్నత చదువులకు జూనియర్ కాలేజీ, కాలేజీ, విశ్వవిద్యాలయాలకు వెళతారు.

**హైస్కూల్లో రెండు కేటగిరీలున్నాయి..**

**1. జనరల్**

**2. ఒకేషనల్**

రేడియో ద్వారా బోధన, కరస్పాండెన్స్ హైస్కూల్ విద్య మొదటిదానిలోకి వస్తాయి. వ్యవసాయం, వాణిజ్యం, మత్స్య, సాంకేతిక విద్యను బోధించే పాఠశాలలు రెండవ కేటగిరీలోకి వస్తాయి. రెండు రకాలు కలిసి ఉండే పాఠశాలల చాలా తక్కువసంఖ్యలో ఉన్నాయి. ఇవేగాకుండా సైన్స్, ఆర్ట్, క్రీడారంగాలకు ప్రత్యేకించి పాఠశాలలు ఉన్నాయి.

## ప్రీ స్కూల్



దక్షిణకొరియాలో సంప్రదాయ విద్యావిధానంలో ప్రీ స్కూల్ విద్య చేర్చలేదు. అయితే సంప్రదాయవిద్యకు అనుబంధమైనదిగా దీన్ని గుర్తించారు. ప్రీ స్కూల్ విద్యకు కిండర్‌గార్టెన్‌లే వసతి కల్పిస్తున్నాయి. ఇటీవల కాలంలో కిండర్‌గార్టెన్‌ల సంఖ్యను పెంచి మరింతమంది పిల్లలకు ప్రీ స్కూల్స్ అందుబాటులోకి తేవడానికి ప్రభుత్వం పటిష్ఠచర్యలు తీసుకుంటోంది. ఇందులో పిల్లలకు అనేక ఆసక్తికర కృత్యాలతో, చదువునేర్పే వాతావరణం కల్పిస్తారు. ఫిజికల్ సైన్సెస్, సోషల్ సైన్సెస్, ఎక్స్‌ప్రెషన్, లాంగ్వేజ్ సంబంధిత అంశాలుంటాయి.

## ప్రాథమిక విద్య

పిల్లలకు ప్రాథమిక విద్యకు సంబంధించి ప్రభుత్వం 1948లోనేచట్టం తెచ్చినప్పటికీ 1953 వరకూ తప్పనిసరి చేయలేదు. కొరియా యుద్ధం తర్వాత కొన్ని అననుకూల పరిస్థితుల కారణంగా జాప్యం జరిగింది. కొరియా రాజ్యాంగంలో 31వ అధికరణ ప్రకారం తల్లిదండ్రులు 6-11 ఏళ్లలోపు పిల్లల్ని తప్పకుండా ప్రాథమికవిద్య చదివించాలి. ఇది పూర్తిగా ఉచితవిద్య. 1952 నుంచి ప్రాథమికపాఠశాలల్లో చేరేవారి సంఖ్య పెరుగుతుండడంతో కొన్ని పాఠశాలల్లో ఏకంగా పదివేలకు పైగా విద్యార్థులు చేరారు. ఒక్కో తరగతిలో అత్యధికంగా 90మంది విద్యార్థులు చేరినట్లు నమోదయింది. చాలా పాఠశాలలు రెండు లేదా మూడు షిఫ్టులుగా నడపవలసి వచ్చింది. 1997నాటికే కొరియాలో 6,623 ప్రాథమిక పాఠశాలలు ఉంటే వాటిలో కొన్నింటికి 902 బ్రాంచీలు కూడా ఉన్నాయిట. లక్షా7,680 క్లాసుల్లో సుమారు 40లక్షలమంది విద్యార్థులు చేరారు. వీరికి లక్షా 40వేలమంది ఉపాధ్యాయులను నియమించాల్సి వచ్చింది.





## మాధ్యమిక విద్య

ప్రాథమికవిద్య పూర్తిచేసినతర్వాత 12-14 వయసు పిల్లలు 7-9 తరగతుల్లో చదివేందుకు ఈ పాఠశాలల్లో అనుమతిస్తారు. ఇటీవలికాలంలో ఈ పాఠశాలల్లో చేరేవారి సంఖ్య ఎంతో పెరిగింది. కరికులమ్ విషయానికి వస్తే ఇందులో 11 మౌలిక లేదా అవసరమైన సబ్జెక్టులు, ఎంపిక చేసినవీ ఉన్నాయి. అదనంగా ఆటపాటలకు సంబంధించినవికూడా ఉన్నాయి. సాంకేతిక, వృత్తిపరమైన కోర్సులు ఎంపికచేసినవాటిలో ఉన్నాయి.

ఈ ఉపాధ్యాయుల్లో చాలామంది నాలుగేళ్ల బిఇడి కోర్సు చేసినవారున్నారు. సమాజంలో ఉత్పత్తికి ఉపకరించే మౌలిక విద్యను ప్రాథమికపాఠశాలల్లో నేర్పడమే లక్ష్యంగా ఉండాలని కొరియా రాజ్యాంగంలోని 93వ అధికరణం పేర్కొంది. ఈ లక్ష్య సాధనకు వీలుగా ప్రాథమికవిద్యలో తొమ్మిది సబ్జెక్టులు ఏర్పరచారు. అవి... మోరల్ ఎడ్యుకేషన్, కొరియా భాష, సోషల్, అర్థమెటిక్, నేచురల్ సైన్స్, ఫిజికల్ ఎడ్యుకేషన్, సంగీతం, కళ, వాస్తవజీవితానికి ఉపయోగపడే కళలు. 1, 2 గ్రేడ్స్‌లో ఈ సబ్జెక్టులు 'క్రమశిక్షణతోకూడిన జీవితం', 'తెలివిగల జీవితం', 'ఆనందకర జీవితం' అనే మూడు విభాగాలుగా కల్పించారు.

## ఉన్నత విద్య

మాధ్యమికపాఠశాల ఉత్తీర్ణులు లేదా అందుకు సమానమైన విద్యార్హతలున్న పిల్లలు ఈ ఉన్నతపాఠశాలల్లో చేరడానికి అర్హులు. ఇది మూడేళ్లపాటు ఉంటుంది. ఉన్నతపాఠశాలలో విద్యాభ్యాసానికి ఖర్చులు విద్యార్థులే భరించాలి. ఈ పాఠశాలల్లో చేరడానికి మొదట ప్రవేశపరీక్షలు నిర్వహించేవారు. 1974లో ఈ విధానానికి స్వస్తి పలికారు. 1995లో విద్యాచట్టాన్ని పునస్సమీక్షించిన తర్వాత ఈ పాఠశాలల్లో విద్యార్థుల ప్రవేశం చాలా కఠినంగా మారింది. ఉదాహరణకు 1997లోనే సియోల్, పూసాన్, క్వాంజూ వంటి పెద్ద నగరాల్లో ఈ పాఠశాలల్లో చేరడానికి ప్రాథమికపాఠశాలల్లో ఉత్తీర్ణులైనవారి విద్యారికార్డును పరిశీలించి మరీ ఎంపిక పద్ధతిన ప్రవేశం కల్పించారు. కొత్తవారికి ప్రవేశం కల్పించడానికి చాలా పాఠశాలలో ప్రవేశ పరీక్ష ఫలితాలను ఆధారం చేసుకున్నాయి. పెద్దపెద్ద పాఠశాలలకు ఆ విధానాన్ని అనుసరించినప్పటికీ సంగీతం, కళలకు సంబంధించిన ప్రత్యేక పాఠశాలలు మరిన్ని ఏర్పాటు కావడం విద్యార్థులకు ఉపకరించాయి. ముఖ్యంగా విదేశాల నుంచి తిరిగి వచ్చిన కుటుంబాల్లోని పిల్లలకు స్వదేశీ పాఠశాలలు, అంతర్జాతీయ పాఠశాలల్ని ఏర్పాటుచేశారు. 1998నుంచి ప్రైవేటు పాఠశాలలజోరు పెరిగింది. ఈపాఠశాలల్లో విద్యార్థులను ఎంపికపద్ధతిలో తీసుకుంటారు, ట్యూషన్ ఫీజుకూడా యాజమాన్యాలే నిర్ణయిస్తున్నాయి. ◆

# బోధనకు

## టీచర్ @ 93

సాధారణంగా 58 సంవత్సరాలకు మన ఉపాధ్యాయులు పదవీ విరమణ చేస్తుంటారు. 93 ఏళ్ల వయస్సులో.. సుమారు 60 సంవత్సరాలపాటు.. నిత్యం బాంబుల మోతలు, తుపాకీ చప్పుళ్లు... కిడ్నాపులు సర్వసాధారణమైన ప్రాంతంలో.. బోధనకే తన జీవితాన్ని మమేకం చేసిన వ్యక్తి గురించి తెలుసుకోవాలంటే పాకిస్థాన్, ఆఫ్ఘనిస్తాన్ సరిహద్దుల్లో ఉండే హిందూకుష్ పర్వతశ్రేణి వరకు వెళ్లాలి. అంతకంటే ముందు... రెండో ప్రపంచయుద్ధ కాలానికి వెళ్లాలి.

# నో సెలవు...







జెఫ్రీ లాంగ్‌లార్డ్‌కు అల్జీబ్రా అన్నా.. సాహస్యకృత్యాలన్నా.. ఎంతో మక్కువ. తన అభిరుచికి తగ్గట్టుగానే తన జీవితాన్ని మలచుకున్నాడు. ముందుగా లెక్కల టీచర్‌గా శిక్షణ పొందాడు. ఆ తరువాత.. సాహసకృత్యాలు చేయాలంటే ఆర్మీనే సరైనదని భావించి బ్రిటిష్ ఆర్మీలో కమాండర్‌గా శిక్షణ పొందాడు. జర్మనీతోపాటు పలు యూరోపియన్ దేశాల్లో యుద్ధాల్లో పాల్గొన్న తరువాత 1947 ప్రాంతంలో భారతదేశానికి చేరుకున్నాడు. దేశవిభజన సమయంలో ఆయన పాకిస్థాన్ ఆర్మీతో పాటు ఉండిపోవాలని నిశ్చయించుకున్నాడు. సుమారు ఏడేళ్లపాటు వారికి యుద్ధకళల్లో శిక్షణ ఇచ్చిన తరువాత.. 1954 నాటికి ఆయన బోధన వైపు మళ్లాలని నిశ్చయించుకున్నారు. అప్పటి ఆర్మీ చీఫ్ జనరల్ ఆయూబ్ ఖాన్‌ను తన మదిలోని భావనల్ని వ్యక్త పరిచారు. దీంతో ఆయన లాహొర్‌లోని ప్రఖ్యాత అట్చిసన్ కళాశాలలో ఆయన బోధించే అవకాశం కల్పించారు. అది మొదలు.. ఆయన జీవితం బోధనకు అంకితమై పోయింది. సుమారు 25 సంవత్సరాలపాటు ఆ కళాశాలలో బిజినెస్, పాలిటిక్స్, ఆర్మీకు సంబంధించిన విషయాల్లో డిగ్రీస్థాయి విద్యార్థులకు శిక్షణ ఇచ్చారు.

1980 ప్రాంతంలో ఆయన నిత్యం ఉద్రిక్తంగా ఉండే ఉత్తర వజీరిస్థాన్‌కు తరలివెళ్లారు. తాలిబాన్ల ఆధిపత్యం ఉన్న ఈ ప్రాంతంలోని రజమక్ కెడెట్ కాలేజీలో పనిచేశారు. అక్కడ పనిచేస్తున్న సమయంలో తీవ్రవాదులు జెఫ్రీని కిడ్నాప్ చేసినా ఏ మాత్రం వెరవకుండా బోధనను కొనసాగించారు.

సుదూర ప్రాంతాల చిన్నారులకు చదువును అందించడం వల్ల ఎన్నో ప్రయోజనాలుంటాయన్న ఉద్దేశంతో ఆయన చిత్రాల్‌ని పాఠశాల నిర్వహణ బాధ్యతను 1989లో తీసుకున్నారు. పర్వత సానువుల నడుమ.. ప్రకృతి అందాల లోగిలిలో ఉన్న ఆ పాఠశాల ఆయన రాకతో కొత్త శోభ సంతరించుకుంది. పరిసరాల్లో ఉండే గిరిజన తెగల వారికి, వారి నాయకులకు చదువు వల్ల కలిగే ప్రయోజనాల గురించి అవగాహన కల్పించారు. దీంతో ఆ పాఠశాలలకు పిల్లలు రాక పెరిగింది. ఇప్పుడు ఆ స్కూలులో 900మంది బాలబాలికలు విద్యను అభ్యసిస్తున్నారు. సంప్రదాయ విద్యకు, ఆధునికతకు బోధనలో పెద్దపీట వేయడంతో ఈ పాఠశాల ఇప్పుడు పాకిస్థాన్‌లోని టాప్ 10 స్కూళ్లలో ఒకటిగా ఎదిగింది. బడిలో మంచి ప్రతిభ కనపరిచిన పిల్లలు.. అనేక స్కాలర్‌షిప్పులు ఇస్తారు. స్టూడెంట్ ఎక్స్చేంజ్ కార్యక్రమం కింద ఆస్ట్రేలియా, అమెరికాలో చదివే అవకాశం కల్పిస్తారు. నెలకు 12వేల రూపాయల వేతనాన్ని మాత్రమే తీసుకునే జెఫ్రీ.. స్కూలు నిర్వహణకు ప్రయివేటునిధులపైనే ఎక్కువగా ఆధారపడతారు.

పాఠశాల నిర్వహణలో జెఫ్రీ ఎంతో క్రమశిక్షణ పాటిస్తారు. చాలా సందర్భాల్లో ఉపాధ్యాయులు, సిబ్బందితో వాగ్వాదానికి దిగినా సరే.. తన మాటనే నెగ్గించుకునేవారని పాఠశాల బోర్డ్ సభ్యుడు, జెఫ్రీ మిత్రుడు సిరాజ్ ఉల్ ముల్క్ అన్నారు.

పిల్లల నుంచి నెలవారీగా నామమాత్రపు రుసుము వసూలు చేస్తారు. బడి అభివృద్ధికి నిధులు కావాలంటూ ఆయన కలవని పాకిస్థాన్ ప్రధాని, అధ్యక్షుడు లేరు. ముషారఫ్, బెనజీర్‌భుట్టో, నవాజ్ షరీఫ్ వంటి పాక్ నేతలను, పలు రాజకీయనాయకులు, విద్యారంగంలో ఆసక్తి ఉన్న ప్రముఖులను కలిశారు. తన పాఠశాల





ప్రగతిమార్గంలో నిలిచేందుకు ఆర్థికంగా సహాయం అంతంతమాత్రమే అందింది. అయినా బోధనకు సంబంధించిన అకుంఠిత సేవాదీక్ష మాత్రం ఆయనలో తగ్గలేదు.

**వ్యక్తిగత జీవితానికి స్థానం లేదు**

65 ఏళ్లపాటు.. భారత్, పాకిస్థాన్‌లో గడిపిన జెఫ్రీ..తన ఇష్టమైన వ్యాపకాలకు అడ్డుగా మారుతుందని భావించి.. వివాహానికి దూరంగా ఉన్నారు. పుట్టి, పెరిగిన గడ్డకంటే... పాకిస్థాన్ అంటేనే ఆయనకు మక్కువ. గడిచిన 65ఏళ్లలో ఆయన బ్రిటన్ వెళ్లిన దాఖలాలు పెద్దగా లేవు. బ్రిటన్‌లో ఉన్న ఆయన తన కవల సోదరుడిని మొత్తం మీద నాలుగు సార్లు మాత్రమే కలిసారు.

**బ్రిటన్ తిరిగి వెళ్లేది లేదు**

93ఏట ప్రవేశించిన జెఫ్రీ ఆరోగ్యం ఇప్పుడు కొద్దిగా దెబ్బతింది. ఇటీవల కాలంలో గుండెపోటుకు గురి కావడంతో తక్షణ చికిత్స కోసం హుటాహుటిన విమానంలో పెషావర్ తీసుకెళ్లాల్సి వచ్చింది. ఇటీవల కాలం వరకు పాఠశాలలలో ఉన్న 900 మంది విద్యార్థులను పేరుపేరునా పలకరించేవాడు. అయితే వారి పేర్లను ఆయన తరచుగా మర్చిపోతున్నాడు. అదేవిధంగా హిందూకుష్‌లో శీతాకాలంలో కురిసే మంచు సైతం ఆయన ఆరోగ్యాన్ని కుంగదీస్తోంది. వీటన్నింటినీ మించి 28 ఏళ్ల పాటు నమ్మిన బంటుగా ఉండి సేవలందించిన వ్యక్తిగత సహాయకుని మరణం సైతం ఆయనపై తీవ్రప్రభావం చూపుతోంది. దీంతో బోధన నుంచి రిటైర్ కావాలని జెఫ్రీ భావిస్తున్నాడు. చిత్రాల్‌లో 900మంది విద్యార్థులతో ఉన్న బడికి జెఫ్రీ తర్వాత అంతటి స్ఫూర్తిదాయక అధిపతి, ఉపాధ్యాయుడు దొరుకుతాడా...!!! అన్న అనుమానం ఆ గ్రామస్తులు వ్యక్తంచేయడం ఆయన విశేష ప్రజ్ఞను చాటుతుంది. పేరుకు రిటైర్ కానున్నప్పటికీ తాను మాత్రం మానసికంగా, శారీరకంగా ధృఢంగా ఉన్నంత కాలం ఇంకా సేవచేస్తాననే జెఫ్రీ అంటారు. బోధన నుంచి తప్పుకున్న తరువాత ఉత్తర వజీరిస్థాన్‌లో ఉన్న రజమక్ కెడెట్ కాలేజీలో తన తుది జీవితం గడిపేస్తానని, ఇంగ్లాండ్ వెళ్లే ఆలోచనే లేదని జెఫ్రీ పేర్కొంటారు.

జాఫ్రీ రిటైర్ అయితే ఆ పాఠశాలలో పెట్టుబడులు పెట్టి సవ్యంగా నడిపేందుకు మరో బ్రిటిషర్ సిద్ధంగా ఉన్నాడు. లండన్ నాటింగ్‌హిల్స్‌కి చెందిన డేవిడ్ గేమ్ పాకిస్తాన్‌లోనూ రెండు పాఠశాలలు నిర్వహిస్తున్నాడు. అందువల్ల ఆయన జాఫ్రీ పాఠశాల పట్ల ఆసక్తి చూపుతున్నాడు. అయితే జెఫ్రీ అంత ప్రతిష్టాత్మకంగా నిర్వహించలేకపోయినప్పటికీ ఆయన ప్రారంభించిన పాఠశాల కనుమ రుగవకుండా కాపాడగలమని స్థానికులూ అంటున్నారు. ◆

నంది..






మేజిక్ స్క్వేర్లు అనాదిగా గణితశాస్త్రవేత్తలను ఎంతగానో ఆకట్టుకుంటున్నాయి. ఈ సిద్ధాంతం క్రీ.పూ.2800 ప్రాంతాల్లో చైనాలో పూర్తిస్థాయిలో అభివృద్ధి చెందాయన్న దానికి ఆధారాలున్నాయి. మనదేశంలో దీనికి సంబంధించిన ఆలోచన 11 లేదా 12వ శతాబ్దిలో ప్రస్తావించిన దాఖలాలున్నాయి. దీనికి సంబంధించిన ఆధారాలు ప్రాచీన ఖజురాహో పట్టణంలో లభించాయి.

మేజిక్ స్క్వేర్ అంటే గళ్లల్లో పరంపరాగత అంకెల్ని ఒక పద్ధతి ప్రకారం అమర్చడం. అది ఎలా ఉండాలంటే ఏ వరుస(నిలువు, అడ్డం, క్రాస్‌గా) లెక్కించినా మొత్తం సంఖ్య ఒకేలా ఉండాలి. మ్యాజిక్‌స్క్వేర్లలో చాలామటుకు 1తోనే ప్రారంభమవుతాయి. వీటిని సింపుల్ మేజిక్ స్క్వేర్ అంటారు. అయితే అన్నింటికంటే చిన్నది, చాలా ఇబ్బందిపెట్టేది 1 × 1 గడి. దానికంటే పెద్దది 3 × 3 గడి. (2 × 2 మ్యాజిక్ స్క్వేర్ సాధ్యం కాదు. దీనికి కారణం మీకు తెలుసా?)

దీనికి ఒక ఉదాహరణను చూడండి. దీనిలో ఏ వరుస (నిలువు, అడ్డం, క్రాస్‌గా) లెక్కించినా 15 వస్తుంది.

| | | |
|---|---|---|
| 4 | 9 | 2 |
| 3 | 5 | 7 |
| 8 | 1 | 6 |

ఒక మ్యాజిక్‌స్క్వేర్ లోని అడ్డం, నిలువు వరుసలు మారుస్తూ మరిన్ని మ్యాజిక్ స్క్వేర్లను తయారుచేయవచ్చు. ఎంత పెద్ద స్క్వేర్ తీసుకుంటే అన్ని ఎక్కువ ప్రత్యామ్నాయాలను రూపొందించవచ్చు. 4 × 4 ద్వారా 34 ప్రత్యామ్నాయ మ్యాజిక్ స్క్వేర్లను తయారవుతాయి. ఇంకా ప్రత్యేకంగా అంటే నాలుగు మూలగళ్లల్లో కూడా ఒకే మొత్తం వచ్చేట్లు చేయవచ్చు.

అలాగే 'మల్టిప్లికేషన్ మేజిక్ స్క్వేర్' వంటి ఆసక్తికరమైన వాటిని కూడా రూపొందించే అవకాశం ఉంటుంది.. నిలువు, అడ్డం, క్రాస్‌గానూ ప్రతివరుసలోని గడిని ఒకదానితో ఒకటి గుణిస్తే వచ్చే మొత్తం ఒకలానే ఉండటం దీని ప్రత్యేకత. ఇందులో మరో ప్రత్యేకాంశమేమంటే, ఏ వరుసలోనున్న అంకెలనైనా కూడినా, గుణించినా వచ్చే సంఖ్య సమానంగా ఉండటం.

| | |
|---|---|
| 1 | 2 |
| 2 | 1 |

ఈరకంగా మీరు 3 × 3 లాటిన్ స్క్వేర్ తయారుచేయగలరా? ఇదేమంత కష్టం కాదు. సుడోకు 9 × 9 లాటిన్ స్క్వేర్ అని ఈసరికే మీకు అర్థమై ఉంటుంది. ఘనాకారం, వృత్తం, నక్షత్రాకారంలో అనేక మేజిక్ ఫిగర్స్ ఉన్నాయి.

మరో రకమేమంటే, యాంటీ మేజిక్ స్క్వేర్. ఇందులోని గళ్లలో 1 నుంచి అంకెల్ని ఒక క్రమంలో రాస్తారు. కానీ ప్రతీ నిలువు, అడ్డం, క్రాస్ వరుసల మొత్తం ఒకటిగా ఉండవు. ఒక క్రమపద్ధతిలో తేడా చూపుతాయి. ఉదాహరణకు క్రింది స్క్వేర్ చూడండి...

| | | | |
|---|---|---|---|
| 15 | 2 | 12 | 4 |
| 1 | 14 | 10 | 5 |
| 8 | 9 | 3 | 16 |
| 11 | 13 | 6 | 7 |

పైన స్క్వేర్‌లో వరుసల మొత్తాలు ఒకే తేడాతో ఉండటం గమనించారా? పైన పేర్కొన్న అర్థం ప్రకారం, 4 × 4 కంటే చిన్న యాంటీ మేజిక్ స్క్వేర్ ఉండదనే భావించాలి. అయితే కొందరు ఈ క్రింద పేర్కొన్నదాన్ని 'యాంటీ' గానే పేర్కొంటారు. కానీ వరుసల మొత్తం ఒకే తేడాతో ఉండాలన్న నియమాన్ని సంతృప్తిపరచదు.

| | | |
|---|---|---|
| 7 | 6 | 5 |
| 8 | 9 | 4 |
| 1 | 2 | 3 |

ఇది క్రింద ఎడమమూల స్క్వేర్‌నుంచి పైకి విరుద్ధంగా వెళుతోంది. మేజిక్ స్క్వేర్‌లో మరొక రకం 'లాటిన్ స్క్వేర్'. ఇందులో గళ్లలోని అంకెలు పునరావృతం అవుతాయి. కానీ ఒకే వరుసలో లేదా అదే వరుసలో పునరావృతంకావు. ఈ రకమైనవాటిలో అతి చిన్నది 4 × 4

ఇక ఎక్కువ మంది ఆల్ఫా మేజిక్ స్క్వేర్‌ను ఇష్టపడతారు. ఈ కింద ఉదాహరణను గమనించండి..

| | | | | | |
|---|---|---|---|---|---|
| 5 | 22 | 18 | 4 | 9 | 8 |
| 28 | 15 | 2 | 11 | 7 | 3 |
| 12 | 8 | 25 | 6 | 5 | 10 |

కుడివైపునున్న స్క్వేర్‌లోనివి ఎడమవైపున్న స్క్వేర్ నుంచి తీసుకున్నవి. ఈ రెండింటికీ సంబంధం కనుగొనగలరా? (సూచన: ఎడమ వైపుస్క్వేర్‌లోనివాటిని ఆంగ్లంలో రాయండి)

ఈ మేజిక్‌స్క్వేర్‌లలో ఆకర్షణీయ అంశం గళ్లలోని అంకెల తీరు; ఇచ్చిన పరిష్కారమార్గానికి ప్రత్యామ్నాయం వెతకడంలోనే ఉంది. 1 నుంచి 16 వరకూ అంకెలున్న 16గళ్లతో కూడిన ఉదాహరణ గమనించండి...

| | | | |
|---|---|---|---|
| 1 | 8 | 12 | 13 |
| 14 | 11 | 7 | 2 |
| 15 | 10 | 6 | 3 |
| 4 | 5 | 9 | 16 |

ఇందులో ప్రతీ అడ్డం, నిలువు వరుసలో అంకెల మొత్తం 34 రావడం గమనిస్తారు. దీనికి ప్రత్యామ్నాయాన్ని గమనించారా?

పరిశీలిస్తే, ఈ మొత్తంలో కుడివైపు పై భాగంలో నాలుగు గళ్లలోని అంకెలు (13, 12, 7, 2) కూడినా 34 వస్తుంది; ఇలానే ప్రతీ మూలనున్న అంకెల మొత్తం అదే సంఖ్య వస్తుంది. అంతేకాదు, మొత్తం గ్రిడ్‌లోని పలు అంకెలను కూడినా వాటి మొత్తం 34 రావడం ఆశ్చర్యపరుస్తుంది. అవేమిటో గుర్తించారా? దీనికి ప్రత్యామ్నాయమేమిటి? సరిసంఖ్యలతో ఉన్న గళ్లతో ఉన్న వరుస ఆ మూలనున్న మొత్తంతో సమానమేనా? ఇలా గళ్లతో, అంకెలతో గణితబోధన ఆసక్తికరంగా ఉందిగదా!

గణిత అభ్యసన మరింత ఆసక్తికలిగించే విధానాలు అనేకం ఉన్నాయి. అయితే ఇదే ప్రకారం, ఇదే విధంగా గణితంలోని ప్రతీదీ బోధించాలని అనడం లేదు. సబ్జెక్టు బోధన, అధ్యయన ఎంతో ఆసక్తికరంగా సాగేట్టు ఉండాలన్నదే దీని వెనుక మర్మం. అంతేతప్ప పొరపాట్లు పరిశోధించడం, తప్పులుచేయడం, చేసినదాన్ని గురించి ప్రశ్నించుకోవడం, మరిన్ని పరిష్కారమార్గాలు, సమాధానాలు ఆలోచించడం, దుర్భేధ్యమార్గంలోకి మనసువెళ్లేట్టు చేయడం.. అన్నీ వెరసి గణితఅభ్యసనలోనివే. ఒక్కటి గమనించాలి.. ఫలితం కంటే అనుసరిస్తున్న విధానం ప్రధానమని గ్రహించాలి. ఆ లక్ష్యం గణితం పట్ల ఉన్న భయాన్ని తొలగిస్తుంది. ఈ తరహా మార్గాన్ని అనుసరిస్తే గణితమేకాకుండా యావత్ విద్యావిధానం, ఇబ్బందులు తొలగి, సులభసాధ్యంగా, హాయిగా ఉంటుంది. అయితే భయాన్ని తొలగించే ఈ బోధనా, అభ్యసన విధానం.. గణితాన్ని పరిశోధించడంలో గమ్మత్తు మరింత తెలుసుకునే ప్రక్రియ. ఉపాధ్యాయుల నుంచే ప్రారంభం కావాలి. ◆

## కార్టూన్ కార్నర్

చిట్టి: మా టీచర్‌కి దైవభక్తి ఎక్కువ తెలుసా?

రవి: ఎలా కనిపెట్టావ్ చిట్టీ?

చిట్టి: మరేం లేదు. నేను ఏ సమాధానం చెప్పినా 'ఓమైగాడ్' అంటోంది మరీ!

రవి: ఆ..



గ్రహాలు ఎన్నో చెప్పు సిద్దూ..? అడిగాడు మాష్టారు

పదకొండు సార్.. బదులిచ్చాడు సిద్ధు.

తొమ్మిదేకదరా... మరి ఆ రెండు గ్రహాలు ఎక్కడి నుంచి పట్టుకొచ్చావ్?!

ఆగ్రహం, సత్యాగ్రహం కూడా గ్రహాలే కదండీ!..

మాష్టారు.. ఆ...



"నేటి బాలలే రేపటి పౌరులు' ఇలాంటిదే ఇంకో వాక్యం చెప్పండి పిల్లలూ" అడిగింది టీచరు.

"రాత్రి చద్దన్నమే... రేపటి వడియాలు" మేడమ్! వెంటనే బదులిచ్చాడు టింకూ..!



# పిల్లలకే కాదు...
# టీచర్లకూ ప్రణాళిక ఉండాలి

భువనగిరిలో ఉపాధ్యాయుడిగా పనిచేస్తున్న తొలిరోజుల్లో ఆదివారం, ఇతర సెలవుదినాల్లో విద్యార్థులకు 'ప్రత్యేక తరగతులు' తీసుకోవటం నాకు అలవాటుగా ఉండేది. ఆదివారంరోజు నేను తరగతులు తీసుకోవటం సీనియర్ ఉపాధ్యాయులు వెంకట్‌రావుగారి కంటపడింది.

"ఏం రామయ్యా! ఆదివారం కూడా పిల్లల్ని వదిలేలా లేనట్లున్నావు? ఎప్పుడు చెప్పుకుపోవటమేనా వేరే పనేం లేదా?" అంటూ నవ్వుతూ ప్రశ్నించారు.

"ఇంట్లో ఖాళీగా ఉండి ఏం చేయాలి సార్? పైగా సిలబస్ కావాలి కదా! సెలవుల్లో కూడా క్లాసులు తీసుకోకపోతే తప్ప సిలబస్ అయ్యేట్లు కనిపించడం లేదు' అని అన్నాను.

'సిలబస్' విషయం తర్వాత చూద్దాంగానీ, ముందు నీవు సెలవుల్లో క్లాసులు తీసుకోవటంవల్ల పిల్లలకు లాభనష్టాల గురించి ఎప్పుడైనా ఆలోచించావా?" అనడిగారాయన. లేదన్నట్లు తలాడించాను. అపుడు వెంకట్‌రావుగారు "క్లాస్‌రూంలో టీచర్ చెప్పటం ఎంత ప్రధానమో, విద్యార్థి స్వతహాగా చేయటం కూడా అంతకన్నా ప్రధానమైనది రామయ్యా! ఎప్పుడూ నీవే చెప్పుకుంటూ పోతే విద్యార్థి స్వయంగా ఆలోచించడానికి, తానుగా చేసుకోవటానికి సమయమెక్కడుంటుంది చెప్పు! టీచరు క్లాసులో చెప్పాక దానిపై విద్యార్థి ఇంటి దగ్గర కృషి చేస్తేనే వారిలో నిపుణత వస్తుంది. తమకంటూ ఒక ప్రత్యేకత ఏర్పడుతుంది. వారికి ఆ అవకాశం ఇవ్వకుండా ఎప్పుడూ 'టీచర్ చెప్పుకుంటూపోతే వారిలో ఆలోచనాసామర్థ్యాన్ని చేతులారా తుంచివేసినట్లు కాదా?" అంటూ నన్నడిగారు.

"ఇంతగా వెంటబడుతుంటేనే చేయటం లేదు సార్. అలాంటిది క్లాస్‌లో చెప్పేసి ఇక మీరు చేసుకోండి అంటే ఎవరు చేస్తారు చెప్పండి. నేను రోజూ చూస్తున్నాను గదా!" అన్నాను.

అపుడు వెంకట్‌రావుగారు "నీవు పొరబడుతున్నావు రామయ్యా! క్లాసులో టీచర్ చెప్పాక దానిపై విద్యార్థులెవరూ ఇంటిదగ్గర కృషిచేయరని, మళ్ళీ పాఠశాలకు వచ్చేవరకూ దాని గురించి ఆలోచించరని అనుకోకూడదు. అలాంటి విద్యార్థులు ఉండరని నేననను గానీ, అందరూ అలాగే ఉండరు. నువ్వు చెప్పిన దానిని ఇంటి వద్ద స్వతహాగా చేసేందుకు విద్యార్థులు తప్పకుండా ప్రయత్నం చేస్తారు. అలా చేయకుండా దాటవేసే విద్యార్థులు ఒకరిద్దరు ఉంటే వారు కూడా స్వతహాగా కృషి చేసేలా ప్రోత్సహించాలేగానీ, ఇదేమీ పట్టించుకోకుండా నువ్వే వారి చేయిపట్టి చివరిదాకా తీసుకెళతానని అనుకుంటున్నావు. దీనివల్ల పెద్దగా ప్రయోజనం జరగదు గమనించు" అన్నారు.

"కొందరికైతే చెప్పిందే నాలుగుసార్లు చెప్పాల్సి వస్తున్నది. ఎంతకూ వారు ముందుకెళ్ళటం లేదు. మీరు చెప్పినట్లుగా సెలవుల్లో క్లాసులు తీసుకోవటం మానివేస్తే, ఇక సిలబస్ పూర్తిచేయడం నావల్ల అయ్యేపని కాదు సార్" అని బదులిచ్చాను. వెంకట్‌రావు గారు ఈసారి ఇంతకు

> “ ఆ.. మరి నీ బోధన కూడా అంతే! వేళకు క్లాస్‌కు వెళ్ళి, పీరియడ్‌ను సమర్థవంతంగా బోధన కోసం ఉపయోగించుకొని, నీ పీరియడ్ కాగానే వచ్చేసెయ్.. ఏ పీరియడ్‌లో ఎంతమేరకు చెబితే సిలబస్ పూర్తికాగలదో పటిష్ఠంగా పథకరచన చేసుకో. సిలబస్ దానంతట అదే అయిపోతుంది. ప్రయత్నించి చూడు. దీనిపై బాగా ఆలోచించు ”



ముందుకన్నా మరింత సుదీర్ఘంగా నా సందేహానికి వివరణ ఇచ్చారు.

"రామయ్యా! విద్యార్థులలో వైయుక్తిక భేదాలు (ఇండివిడ్యువల్ డిఫెరెన్సెస్) ఉంటాయి. ఈ విషయం నీకు తెలియంది కాదు. ఉపాధ్యాయునిగా మనం ఆ వాస్తవాన్ని అంగీకరించి తీరాలి. క్లాసులోని అందరు విద్యార్థులు ఒకే స్థాయిలో ఉండటం జరగదు. కొందరికి ఒకటికి రెండుసార్లు చెప్పాల్సి వస్తుంది. అలాంటి విద్యార్థులకోసం ప్రత్యామ్నాయ క్లాసులు తీసుకోవాలి. చదువులో వెనుకబడిన విద్యార్థులను

గుర్తించి, వారికి ఏఏ అంశాల్లో ఇబ్బందులు ఎదురవుతున్నాయో గమనించి, బేసిక్స్‌పై మంచి అవగాహనను ఈ క్లాసుల ద్వారా పెంపొందించాలి. వారికోసం అదనంగా క్లాసులు తీసుకోవటాన్ని నేను వద్దనను. అది తప్పనిసరి కూడా. కానీ చేసేవాడిని, చేయనివాడిని అంటే స్లోలెర్నర్‌ను, తెలివైనవాడినీ అందరినీ ఒకే గాటిన కట్టి ఆదివారాలు సెలవు దినాల్లోనూ క్లాసులు తీసుకుంటానంటే తగిన పద్ధతి కాదు. ఆలోచించు" అంటూ ముగిస్తుంటే "మరి సిలబస్ పరిస్థితి ఏంగాను? అంతా చెప్ప కపోయినా ఫర్వాలేదంటారా" అంటూ నవ్వుతూ ప్రశ్నించాను. అపుడు వెంకట్‌రావు గారు "విద్యార్థి మూడుగంటలలో రాయాల్సిన ప్రశ్నాపత్రాన్ని నాలుగ్గంటలపాటు రాస్తానంటే ఒప్పుకుంటారా?" అని అడిగారు. "అదెలా కుదురుతుంది సార్. నిర్దేశించిన సమయంలోపే విద్యార్థి సమాధానాలు రాయాలి. అలా రాస్తేనే విద్యార్థి పరిజ్ఞానం, ప్రణాళిక అన్నీ తెలుస్తాయి" అన్నాను. "ఆ.. మరి నీ బోధన కూడా అంతే! వేళకు క్లాస్‌కు వెళ్ళి, పీరియడ్‌ను సమర్థవంతంగా బోధన కోసం ఉపయోగించుకొని, నీ పీరియడ్ కాగానే వచ్చేసెయ్.. ఏ పీరియడ్‌లో ఎంతమేరకు చెబితే సిలబస్ పూర్తికాగలదో పటిష్ఠంగా పథకరచన చేసుకో. సిలబస్ దానదంతట అదే అయిపోతుంది. ప్రయత్నించి చూడు. దీనిపై బాగా ఆలోచించు" అంటూ ముగించారు.

ఆలోచించాను.... ఇంటికెళ్ళాక ఆలోచిస్తే వెంకట్‌రావుగారి మాటలు నాలోఎంతో మార్పుకు బీజం వేశాయి. టీచర్ క్లాసులో చెప్పిన విషయంపై పనిచేసేందుకు విద్యార్థికి తగిన సమయం అవసరమని, విద్యార్థి కాస్త సేదదీరాలన్నా, సొంత ఆలోచనలు, అభివృద్ధి పరచుకోవాలన్నా అదనపు క్లాసులు వారికి ప్రతిబంధకాలుగా నిలుస్తాయని గుర్తించటానికి నాకు ఎంతో కాలం పట్టలేదు. అలాగే తన చదువును గూర్చి విద్యార్థి పథకరచన చేసుకోవాలన్నా తన బోధన గురించి టీచర్ పథక రచన చేసుకోవాలన్నీ, అందుకు సెలవు దినాలు ఎంతో ఉపయోగపడతాయని గుర్తించాను. ఇక ఆ తర్వాత ఎప్పుడూ నేను స్పెషల్ క్లాసులంటూ ఆదివారాలు, సెలవు దినాలలో క్లాసులు తీసుకునేవాడిని కాదు. స్లోలెర్నర్స్‌కు మాత్రమే అదనపు క్లాసులను పరిమితం చేసుకున్నాను.

పట్టణాలలో ఎక్కడ ఏ మాత్రం ఖాళీస్థలం దొరికినా అక్కడో అపార్ట్‌మెంట్ కట్టినట్లు విద్యార్థులకు ఏ కాస్త ఖాళీ సమయం దొరికినా, సెలవులు వచ్చినా వారు సేదదీరేందుకు గానీ, తరగతి గదిలో చెప్పిన విషయం వారి మనసులో నాటుకునేందుకుగానీ, స్వతహాగా ఆలోచించేందుకుగానీ అవకాశం ఇవ్వకుండా స్పెషల్ క్లాసులు ఏర్పాటుచేయటం ఇప్పుడు రివాజుగా మారింది. ఆశ్చర్యక రంగా తల్లిదండ్రులూ నోరు మెదపడం లేదు. విద్యాయంత్రాంగమూ పట్టించుకోవటం లేదు. వెరసి విద్యార్థుల సజనాత్మక శక్తికి దారులు మూసేస్తున్న నేటి విద్యావిధానం చూస్తుంటే ఆనాడు వెంకట్‌రావుగారు చెప్పిన మాటలు నాకు ఇప్పటికీ చెవుల్లో మారుమోగుతుంటాయి.

(.. చుక్కా రామయ్య 'జ్ఞాపకాలు' నుంచి)



# సాయపడే చేతులు

## సమాజసేవకు కంకణం కట్టుకున్న

# ఉదవమ్ కరంగల్

సమాజంలో సహాయంకోసం ఎదురుచూస్తున్న వారు చాలామంది ఉన్నారు. వారిని చిన్న చిన్న అవసరానికి ఆదుకోవడం కొందరు చేస్తుంటారు. కానీ వారిని అక్కున చేర్చుకుని ఆసరాగా నిలిచి కొత్త జీవితాన్ని ఇచ్చేందుకు నడుం బిగించడం ఎంతో అవసరం. ఈ లక్ష్యంతో ముందడుగు వేస్తున్న స్వచ్ఛంద సంస్థ ఉదవమ్ కరంగల్. ఉదవమ్ కరంగల్ అంటేనే సహాయం చేసే చేతులు అని అర్థం. సంస్థపేరు మాత్రమే కాదు ఆ సంస్థ చేపడుతున్న ఎన్నో కార్యక్రమాలు, సేవలు, అవసరాల్లో ఉన్నవారికి వెన్నుదన్నుగా నిలిచి ధైర్యాన్నిస్తున్నాయి.

విద్యాకర్ అనే సామాజికకార్యకర్త 1983లో చెన్నైలోని ఎన్ఎస్‌కె మురికివాడలో ప్రారంభించారు. ఒక సినిమా థియేటర్ వద్ద ఎవరో వదిలివెళ్లిన పిల్లాడిని ఒక రిక్షాలాగేవ్యక్తి విద్యాకర్ వద్దకు తీసుకువచ్చి కాపాడమని అర్థించాడు. ఆ పిల్లాడిని తన చేతుల్లోకి తీసుకున్న విద్యాకర్ అలాంటి పిల్లల్ని ఆదుకోవడం కొనసాగించి ఎందరో అనాథలకు 'పప్పా (నాన్న)'గా మారాడు. సుమారు 2000మంది అనాథ పిల్లలకు, ఆదరణలేని పెద్దవారికి అండగా నిలిచాడు. తన సేవాకేంద్రంలో వారికి ఆరోగ్య, విద్యా సహకారం పూర్తిస్థాయిలో అందిస్తూ బాధలను మరిచి కొత్తజీవితానికి మార్గదర్శకునిగా మారాడు. గత 27ఏళ్లలో 2000మందికి ఆసరా కల్పించి మరెందరో అనాథలకు చిరునవ్వును ప్రసాదిస్తోంది ఉదవమ్ కరంగల్.



**పప్పా విద్యాకర్**

మనచుట్టూ ఉన్న బాధితులను ఆదుకోవడానికి ఎవరో ఒకరు ముందుకు రావాల్సిందే. ముందుకు వచ్చినా నిజానికిది ఏమాత్రం ఆర్థికంగా ఉపకరించేది కాదు, విమర్శలనే ఎక్కువగా ఎదుర్కోవాల్సి వస్తుంది. అయినా వారికి అండగా నిలవాలన్న లక్ష్యంతోనే ముందడుగు వేశానంటాడు విద్యాకర్. కర్ణాటకలోని మైసూర్ సమీపంలోని కొల్లేగాల్ గ్రామంలోని నిరుపేద కుటుంబానికి చెందిన విద్యాకర్ ఎంతో కష్టపడి చదువుకున్నాడు. చెన్నైకి చెందిన రామకృష్ణన్ అనే వ్యక్తి సహాయ సహకారాలతో సోషల్ వర్క్‌లో మాస్టర్ డిగ్రీపొందాడు. ఇతరులకు ఎంతో కొంత సహాయంచేయాలన్న ఆలోచనే తన సంస్థకు పునాది అయింది. తన దరికి చేరినవారిలో అనాథలు, ఎయిడ్స్ వ్యాధిగ్రస్తులు, కుటుంబం వదిలేసినవారు ఎందరెందరో ఉన్నారు. విద్యాకర్‌కు మద్దతుగా 75మంది కార్యదక్షతగల వాలంటీర్లు ఉన్నారు. సమాజంలో అనేకవర్గాల నుంచి వచ్చిన 12మందితో కూడిన పాలక వర్గం సంస్థ కార్యకలాపాలన్నీ పర్యవేక్షిస్తుంది. ఇటువంటి పాలకవర్గం అమెరికా చాప్టర్ కూడా నెలకొల్పారు. 'ఉదవమ్‌కరంగల్ అమెరికా' అమెరికాలో ఐఆర్ఎస్ గుర్తింపు పొందిన సేవాసంస్థ.



**కార్యకలాపాలు**

రామకృష్ణ విద్యానికేతన్ : తమ సంస్థలో ఆశ్రయాన్ని కోరి చేరిన పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పడానికి చెన్నైలోని తిరువేర్కాడులో రామకృష్ణ విద్యానికేతన్ అనే బడిని కేవలం 150మంది విద్యార్థులతో 1997లో ప్రారంభించారు. ఇందులో ఎల్‌కెజి నుంచి 12వ తరగతి వరకూ విద్య నేర్పుతారు. సమీపంలోని ప్రభుత్వ పాఠశాలలలో తగినన్ని మౌలిక సదుపాయాలు లేకపోవడంతో చాలామంది ఆ చుట్టుపక్కల ప్రాంతాల్లోని అన్నివర్గాలకు చెందిన పిల్లలు ఇక్కడ చేరారు. తమిళనాడు ప్రభుత్వం ఈ విద్యాసంస్థ సేవలు గుర్తించి 1999లో హయ్యర్ సెకండరీ తరగతులు నిర్వహించడానికి అనుమతినిచ్చింది. ఇందులో నగరంలోని మురికివాడపిల్లలు, చుట్టుపక్కల గ్రామాల్లోని వెనుకబడిన తరగతుల పిల్లలు కూడా చదువుకోవడానికి వస్తున్నారు. ప్రస్తుతం దీనిలో 1700మంది విద్యార్థులు ఉన్నారు. కోయంబత్తూరులోనూ ఈ పాఠశాల బ్రాంచీలు ప్రారంభమయ్యాయి. విదేశీయులు అందించిన నిధులతోనే కోయంబత్తూరులో రామకృష్ణ విద్యా మందిర్‌ను ప్రారంభించారు. ఇందులో ప్రస్తుతం 500మంది విద్యార్థులు ఉన్నారు. అలాగే సమాజసేవపట్ల యువతలో ఆసక్తి కలిగించేందుకు చెన్నై స్కూల్ ఆఫ్ సోషల్‌వర్క్ ఏర్పాటుకు పూనుకున్నారు.

పునరావాసం: అనాథలకు ముఖ్యంగా వీథుల్లో, మురికివాడల్లో తిరుగుతుండే వారికి రక్షణ కల్పించడమన్నది ఎంతో కష్టంతో కూడిన పని. ఉదవమ్‌కరంగల్ అధికారులు, కార్యకర్తలు గొప్పలక్ష్యంతో, కార్యదీక్షతో వారిని ఆదుకుంటున్నారు. ఇప్పటివరకూ 7697 మందికి మానసికవ్యాధిగ్రస్తులను దీర్ఘ, స్వల్పకాలవ్యవధి చికిత్సనిస్తూ వారికి రక్షణ కల్పిస్తున్నారు. ఇలా అనారోగ్యంతో ఉన్నవారికి మందులు అందించడమేకాకుండా వారికి ఆ జబ్బునయమవుతుందన్న నమ్మకాన్ని కలిగించేలా వారితో స్నేహభావంతో మెలగడానికి చికిత్సాకాలం తర్వాత చాలామందిని పునరావాసకేంద్రానికి తరలించారు. కొందరిని వారి కుటుంబాలకు అప్పగించారు. కొందరు సంపూర్ణ ఆరోగ్యంతో స్వయంగా ఉపాధికోసం వెళ్లారు. మరికొందరు సంస్థలోనే సేవాకార్యక్రమాల్లో సహాయకులుగా ఉన్నారు. సుమారు 3346మంది ముసలి అనాథలను అక్కునచేర్చుకున్న కరంగల్ వారి ఆరోగ్యరక్షణకు కంకణం కట్టుకుంది. వీరిలోనూ చాలామందిని సంపూర్ణఆరోగ్యంతో వారి బంధువుల వద్దకు చేర్చగలిగింది. కొందరు మరణించగా, మరికొందరు ఇంకా సంస్థ సంరక్షణలో ఉన్నారు. గత రెండు దశాబ్దాల్లో సుమారు 2100మంది పిల్లలు ఉదవమ్ కరంగల్‌నుంచి ఎంతో మద్దతు పొందారు. వారిలో 6,700మంది అనాథలు వారి తల్లిదండ్రులు, బంధువులవద్దకు తిరిగి వెళ్లారు. 4921మందికి కౌన్సెలింగ్ ఇచ్చారు. 5206మందిని ఇతర ప్రత్యేకసంస్థలకు పంపారు. అలాగే మరో 32220మంది టైలరింగ్,

కొవ్వొత్తులు, అగరవత్తుల తయారీ, ఫినాయల్ తయారీవంటి తక్కువ కాలవ్యవధి కోర్సుల్లో చేరి ఎంతో లబ్ధిపొందారు.

సునామీ సమయంలో... 2004 డిసెంబర్ 26న ఇండోనేషియా సుమత్రాలో వచ్చిన సునామీ ఇటు భారత్‌పైనా ప్రభావం చూపింది. అపుడు అండమాన్ నికోబర్ ద్వీపాలు, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, కేరళ తీర ప్రాంతాలు దెబ్బతిన్నాయి. వేలాందిమంది నిర్వాసితులయ్యారు, ఎందరో ప్రాణాలు కోల్పోయారు. ఆ సమయంలో ఉదవమ్ కరంగల్ సేవలు హర్షణీయం. తమిళనాడు, కేరళల్లో ఈ సంస్థ కార్యకర్తలు బాధితులను ఆదుకున్నారు. చాలామందికి పునరావాస కేంద్రాలు ఏర్పాటుచేసి ఆరోగ్య రక్షణ కల్పించారు. కుటుంబాలు దూరమైపోయినవారికి ఆత్మస్థైర్యం కల్పించారు. పిల్లల్ని అక్కున చేర్చుకున్నారు. వారి విద్యావకాశాలు కొనసాగేట్టు చూశారు. మహిళలకు ఉపాధి కల్పించారు.



### కౌన్సెలింగ్

వెనుకబడిన తరగతులవారికి, ఆర్థికంగా వెనుకబడినవారికి అవసరమైన సహాయ సమాచారాన్ని, కౌన్సెలింగ్ ఇస్తోంది. సాధారణంగా ఈ కేంద్రానికి అనేక సమస్యలతో వస్తుంటారు. ముందుగా వారికి వారి సమస్యలను అధిగమించేందుకు వ్యక్తిత్వ, ఆరోగ్యపరమైన సామర్థ్యాన్ని పెంపొందించే సూచనలు చేస్తుంది. మరీ మానసికసమస్యలతో ఇబ్బందిపడుతున్నవారికి చెన్నైలో, చుట్టుపక్కల ప్రాంతాల్లోని మానసిక ఆరోగ్యకేంద్రాలను సంప్రదించి వారిని పంపడం జరుగుతోంది. గృహహింసలకు గురవుతున్నవారికి, ఆర్థికపరంగా మానసిక ఇబ్బందులు పడుతున్నవారికి కూడా తాత్కాలిక ఆసరా కల్పించి వారికి మనోధైర్యాన్ని ఇస్తోంది. ఈ సంస్థకు వస్తున్నవారిలో 60శాతం మంది ఎంతో ప్రగతి సాధించి స్వయం ఉపాధిపట్ల ఆసక్తి చూపుతున్నారు.

### కార్పొరేట్ భాగస్వామ్యం

సమాజసేవ, అభివృద్ధి కార్యక్రమాల్లో ఇటీవలి కాలంలో అనేక కార్పొరేట్ సంస్థలు పాలుపంచుకోవడం గమనిస్తున్నాం. సమాజసేవలో పాల్గొనడం లేదా సమాజసేవకు అంకితమైన సంస్థలకు ఆర్థికపరంగా వెన్నుదన్నుగా నిలవడం కార్పొరేట్‌సంస్థలు పూనుకుంటున్నాయి. అలాగే ఉదవమ్ కరంగల్‌కు పలురకాలుగా కార్పొరేట్‌సంస్థలు మద్దతునిస్తున్నాయి. వాహనాలు, భవన నిర్మాణాలు, మౌలికసదుపాయాల కల్పనలో ఆర్థికమద్దతునివ్వడం ద్వారా అనేక ప్రాజెక్టులు కల్పిస్తున్నాయి. ఉదవమ్ సేవాకార్యక్రమాలకు ఇతరసంస్థలు, వ్యక్తుల ఆర్థికమద్దతు కూడా లభిస్తోంది. కార్పొరేట్ సంస్థలు తమ ఉద్యోగులు, సిబ్బంది జీతాల్లో ప్రతినెలా కొంత ప్రజాసేవ కార్యక్రమాలకు నిధిగా ఏర్పాటు చేస్తుంటాయి. వీటి నుంచే ఉదవమ్ వంటి ఎన్జీఓ సంస్థలకు ఆర్థికసాయం చేస్తుంటాయి. అలాగే ప్రచారసామగ్రి రూపొందించడంలో, ప్రచారంలో పాల్గొనడంలోనూ మద్దతునిస్తున్నాయి.



### అవార్డులు, గుర్తింపు

- అనాథలకు ఉన్నతస్థాయిలో సేవాకార్యక్రమాలు నిర్వహిస్తు వారికి అండదండగా నిలుస్తున్న ఉదవమ్ కరంగల్‌కు అనేక అవార్డులు, గుర్తింపులు లభించాయి. ముఖ్యంగా...
- భారత్‌లో అత్యున్నత సేవాసంస్థగా గుర్తిస్తూ 1192లో జపాన్ ప్రభుత్వం ఇచ్చిన అంతర్జాతీయ అవార్డు
- బెంగుళూరు కన్నడ రాజ్యోత్సవ అవార్డు
- చెన్నై రోటరీక్లబ్ ప్రతిష్ఠ అవార్డు
- నేషనల్ యూత్ ఫెడరేషన్, ఢిల్లీ నుంచి ఉత్తమ సమాజసేవకుని అవార్డు
- చెన్నై తెలుగు అకాడమీ నుంచి ఉగాది పురస్కారం
- లౌడ్ థింకింగ్ ఫోరమ్ నుంచి భారత్ ఎక్సెలెన్స్ అవార్డు
- 1996లో మాషియో హ్యూమానిటేరియన్ అవార్డు, ముంబై
- 2003లో ఫిలడెల్ఫియా నగరం అందించిన ఉన్నత సేవా గుర్తింపు
- పెన్సిల్వేనియా గవర్నర్ నుంచి ఉన్నత సేవాసంస్థ గుర్తింపు
- సునామీ బాధితులకు అందించిన సేవకు డెనవర్ సిస్టర్ సిటీస్ 2005లో ఇచ్చిన ఉత్తమసేవాసంస్థ గుర్తింపు ◆

# English చదువులు



డా. బి.వి. పట్టాభిరామ్

"గణిత శాస్త్రం అంటే గాబరాగా ఉంటుంది. అందుకనే నాకు లెక్కలు కష్టం. పెద్దయ్యాక లెక్కలులేని డిగ్రీ మాత్రమే చదువుతాను."

"సైన్సు పేరు చెప్తేచాలు, గుండె జారిపోతుంది. అందుకే సైన్సులేని మరో డిగ్రీ చేస్తాను."

"ఈ జన్మలో నాకు ఇంగ్లీష్ రాదు. అందుకే నాకు చదువురాదు. పెద్ద ఉద్యోగాలు అసలే రావు'.. అంతా నా ఖర్మ.

"ఈ చదువు గురించి తలుచుకుంటూంటే భయంవేస్తూంది. మా తల్లిదండ్రుల్ని ఎంతో నిరాశకు గురిచేస్తున్నాను. అందుకే బతికి ఏమీ సాధించలేనని నాకు అనిపిస్తుంది."




... ఇటువంటి భయాలు, భీతులు, ఆందోళనలున్న వారికి ఏ డాక్టరు మందు ఇవ్వగలడు? ఏ తావీజు ఆలోచనలను మార్చగలదు? ఏ కౌన్సెలర్ ఎంతవరకు మానసిక స్థితిని మార్చగలడు?

ఆలోచించండి!

ఎవరు ఎంతచేసినా, అది కొంతవరకే!

మరెవరు వారి మనోస్థితిని మార్చగలరు?

ఇంకా ఆలోచన ఎందుకు?

మన ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులు మాత్రమే.

ఐతే ఒక కండిషన్!

అదే! ముందుగా వారు మారాలి.

ఉపాధ్యాయినీ, ఉపాధ్యాయులు మైండ్ సెట్ మార్చుకోవాలి.

అదెలా?

ఇలాగ...

**మైండ్‌సెట్ మార్చుకోవాలి**

టీచర్లు తాము చెప్పే పాఠాలతో పాటు, ఇతర సబ్జక్టుల విషయంలో కూడా సానుకూల వైఖరిని అలవరుచుకోవాలి. ఇతర సబ్జక్టుల గురించి మాట్లాడినపుడు, సరదాకి కూడా వ్యంగ్యంగా కామెంట్ చేయకూడదు.

నేను హైస్కూల్లో చదువుతున్నరోజుల్లో ఒక లెక్కల మాస్టార ఆల్జీబ్రా గురించి చెప్తూ "ఆల్జీబ్రా ఈజ్ గుండె

గాభరా" అన్నారు. అది నవ్వుకోవటానికి బాగున్నా, మా మనసుల మీద మాత్రం భయం నాటుకుంది. మేమెవరం కూడా ఇంజనీరింగు దరిదాపులకు పోలేదు. అది ఆయన తనకు తెలియకుండా చేసిన అపరాధం.

ఇప్పటికే సినిమాల్లో పాటలు, డైలాగులు చదువుపట్ల కలిగిస్తున్న ప్రతికూల వైఖరి బలంగా ఉంది. "బోటనీ క్లాసంటే బోరు బోరు", "హిస్టరీ క్లాసంటే రొష్టు" లాంటి పాటలు. "నేను ఫోటోగ్రాఫర్‌ని అవుదామనుకుంటే నా పేరెంట్స్ ఐఐటిలో చేర్పించారు.", నేను రచయిత్రి నవుదామనుకుంటే, మా నాన్న డాక్టర్ని చేశాడు" వంటి డైలాగులు పిల్లల్ని తప్పుతోవ పట్టిస్తున్నాయి.

ఇక ఇలా చూస్తూ ఎంతకాలం వేచి చూడాలి. అందుకే టీచర్లూ మైండ్‌సెట్ మార్చుకుని రంగప్రవేశం చేద్దాం రండి.



# ENGLISH

## కష్టపడి చదవకండి

ఈ భూప్రపంచంలో ఇంగ్లీషువారి తరువాత, ఇంగ్లీష్ మాట్లాడగలిగేవారు ఎవరో తెలుసా?

ఆశ్చర్యం అనిపించినా అక్షరాలా నిజం ఏమిటంటే, తెలుగువారే!

అవును. నిజం. తెలుగువారు మాత్రమే, తమ భాషలో అత్యధిక ఇంగ్లీషు పదాలు ఉపయోగిస్తారు. ఆ తెలుగువారిలో మీరూ ఉన్నారు. మీ విద్యార్థులు కూడా ఉన్నారు, అంతేకాదు మీ విద్యార్థుల తల్లిదండ్రుల్లో నిరక్షరాస్యులు కూడా ఇంగ్లీషు మాట్లాడుతున్నారని మీరెప్పుడైనా గమనించారా? బహుశ మీరు నన్ను నమ్మటం లేదదనుకుంటాను. నమ్మకపోయినా ఇది చదువుతూనే ఉండండి. చివరకు మీరే 'వెరీ గుడ్', వండర్ ఫుల్' అని ఇంగ్లీషులో అంటారు. చూడండి మీరే!

మనం రోజూ ఉపయోగించే వివిధ వాహనాల పేర్లను, తెలుగులోకాక ఇంగ్లీషులో అంటున్నాం. అవి గమనించండి.

సైకిల్, ఆటో, కారు, బస్సు, బైక్, లారీ, ట్రాక్టరు, రైలు...' ఇవన్నీ ఇంగ్లీషే. వీటిని తెలుగులో అనువాదం చేసి చెప్పగలరా? చెప్పగలరు! ఎందుకంటే మీరు టీచర్లు.

కానీ...

మీరు చెప్పినది, ఎదుటివారికి అర్థం అవుతుందా? ఉదాహరణకు ద్విచక్రవాహనం, త్రిచక్రవాహనం, ప్రయాణీకులకు తీసుకునివెళ్ళే షట్చక్రవాహనం, ధూమశకటం.... ఇలా అంటే అవతలివారికి విచిత్రంగా వినిపించవచ్చు.

మనలో చాలామంది 'సినిమా' అంటాం కానీ చలనచిత్రం అనటం లేదు. కానీ తమ భాషను అమితంగా ప్రేమించే తమిళ సోదరులు 'పడం' అంటారని తెలుసుకదా!

ఒకసారి బిల్‌గేట్స్ తన ట్రస్ట్ ద్వారా కొంత ధన సహాయం చెయ్యటానికి ఆంధ్రప్రదేశ్‌లోని ఒక గ్రామం వెళ్ళారు. ఆ గ్రామ మహిళలు కొంచెం ఆలస్యంగా వచ్చారు వస్తూనే "నమస్తే సార్! బస్సు కొంచెం లేటయిపోయింది టైమయిందా ?" అన్నార్ట.

అది విని బిల్ గేట్స్ గతుక్కుమన్నాట్ట. పక్కనున్న మన అధికారులకేసి చూస్తూ, 'మీభాష, మా ఇంగ్లీషు భాషకు చాలా దగ్గరగా ఉందే! అని ఆశ్చర్యపోయాట్ట.

మన అధికారులు ముందు తల పంకించకపోయినా, తరువాత వారి డైలాగ్ గుర్తు తెచ్చుకుని 'నిజమేస్మీ!' అనుకున్నారు. ఆ డైలాగ్‌లో సార్, బస్సు, లేటు, టైము ఉన్నాయి. మరి వారంతా నిరక్షరాస్యులే.

సాధారణచదువు కలిగిన తెలుగువారు మాట్లాడే భాషలో ఎన్ని ఇంగ్లీషు పదాలున్నాయో చూడండి. అవి తెలుగులో కలిసిపోయాయి.

"ఈ రోడ్డు చివర్లో..." రోడ్డుని రహదారి అనాలి. ఉత్తర భారతీయులు 'రాస్తా' అంటారు. మనం మాత్రమే రోడ్డు అంటాము. చివరకు రాష్ట్ర ప్రభుత్వం కూడా 'రోడ్డు రవాణా సంస్థ' (ఆర్టీసీ) అంటున్నారు. రహదారి రవాణా సంస్థ అని కూడా అనవచ్చు. కానీ పల్లె ప్రజలకు అర్థం కాకపోవచ్చు.

**అలాగే మరికొన్ని...**

"నువ్వు ఫస్ట్‌క్లాస్‌లో పాసవ్వాలి"
"నీకు మంచి మార్కులు రావాలి"
"ఒక కొత్త ఏసీ కొనాలి"
"మా కలర్ టెలివిజన్ బాగుంది"
"ప్రతి క్లాస్‌రూములో ట్యూబ్‌లైట్లు, ఫాన్లు అవసరం"
"కుర్చీ పర్వాలేదు, టేబుల్ బాగా లేదు.
నీ కొత్త బూట్లు బాగున్నాయి"
"నువ్వు క్యూలో నిలబడి రా"
"నీ హాల్‌టికెట్ నంబరు ఎంత?"
'మా ఇంట్లో ఫ్యాను సరిగా తిరగటం లేదు"
"ఈ కాలం పిల్లలకు ఫ్యాషన్లు ఎక్కువయ్యాయి"

ఇలా రాసుకుపోతే ఎన్నో ఎన్నో ఇంగ్లీషు పదాలు తెలుగులో చోటుచేసుకున్నాయి. అలాగే ఈ ఇంగ్లీషు పదాలను తెలుగులో ఏమంటారో మీరే ఊహించండి.

ఓకే, బస్టాండు, రైల్వేస్టేషను, కేలండరు, స్కూల్‌బ్యాగ్, బ్రష్, పేస్టు, స్టవ్వు, గ్యాసు, పెన్ను, పేపరు, పెన్సిలు, కాలేజీ, ఫీజు, సిగ్నల్, పోలీసు, లెక్చరర్, డాక్టరు, కూల్‌డ్రింకులు, ఇంజనీరు, రేడియో, టెలివిజన్... ఇలా రాస్తే ఈ పుస్తకం అంతా సరిపోదు.

అంతెందుకు? మీలో చాలామంది ఉపయోగించే 'సెల్‌ఫోన్'ని తెలుగులో ఏమంటారో తెలుసా? ఒక్కసారి కళ్ళు మూసుకుని ఆలోచించండి.

అక్షరాలా తెలుగులో "సంచార దూరశ్రవణ యంత్రం" అనాలి. అయితే ఎవరికీ అర్థం కాదు.

సినిమా విషయానికొస్తే, హీరో, హీరోయిన్, విలన్, డైరెక్టర్, ఫోటోగ్రఫీ, మ్యూజిక్ అన్నీ ఇంగ్లీషు మాటలే (ఇతర ప్రాంతాల్లో వేరే పదాలున్నాయి). అలాగే హీరోలకు ఇచ్చిన బిరుదులు కూడా ఇంగ్లీషువే. సూపర్‌స్టార్, మెగాస్టార్, రెబెల్‌స్టార్, ఫ్యామిలీ హీరో... ఇలా ఉన్నాయి. చాలా తక్కువ బిరుదులు నటరత్న, నటసామ్రాట్, నట కిరీటి, నటభూషణ, నవరసనటనా... ఇలా తెలుగులో కొందరికే ఉన్నాయి.

ఇప్పుడు చెప్పండి!

తెలుగువారికి ఇంగ్లీషు రాదని నెవరన్నారు? హు సెడ్ ఇట్!

తెలుగువారందరికీ ఇంగ్లీషు బాగావచ్చు. ఎటొచ్చీ సమస్య ఒక్కటే!

"నాకు ఇంగ్లీషు రాదు" అనే నెగెటివ్ సజెషన్ రోజూ ఇచ్చుకుంటున్నారు.




### ప్రియమైన ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులారా!

బాలబాలికల్లో ఉన్న ఈ ఆంగ్లోఫోబియా (ఇంగ్లీషు భయం) పోగొట్టవలసిన బాధ్యత మీమీద ఉంది. వారికి చెప్పేముందు, మీరు కూడా వారితో వీలైనంతవరకు ఇంగ్లీషులో మాట్లాడండి. అలాగని తెలుగుని విస్మరించమని కాదు.

ఈ కాలంలో ఇంగ్లీషు తప్పనిసరి. రోడ్డు మీద వాల్‌పోస్టర్లు, దుకాణాలు ముందుండే బోర్డులు, బస్సు రూట్లు... ఇలా ఇంగ్లీషు తెలుగువారిలో దూరిపోయింది. మమ్మీ, డాడీ, మార్నింగ్, గుడ్‌నైట్ లాంటి మాటలు తెలుగైపోయాయి. కాబట్టి ఆ పదాలను కూర్చి చిన్న చిన్న వాక్యాలు మాట్లాడమని ప్రోత్సహించండి.

నేను కాలేజీల్లో వ్యక్తిత్వ వికాస శిక్షణ కార్యక్రమాలు చేసినపుడు, ఒక ఆసక్తికరమైన పోటీ నిర్వహిస్తాను. ఎవరైతే 5 నిమిషాలపాటు, ఒక్క ఇంగ్లీషు పదం లేకుండా తమ మాతృభాషలో మాట్లాడతారో వారికి బహుమతి ఇస్తాను. ఈ పదిహేనేళ్ళలో ఇంతవరకూ ఇద్దరు మాత్రమే మాట్లాడారు. చివర్లో బహుమతి తీసుకుని 'థాంక్యూ సర్" అని వెళ్ళారు.

మనం మాట్లాడే భాష అచ్చ తెలుగుకాదు. కాబట్టి దీన్ని తెలింగ్లీష్ అనుకోవాలి. ◆






## 15 ఏళ్లకే కేంబ్రిడ్జ్‌లో సీటు

బ్రిటన్‌కు చెందిన 15 ఏళ్ల బాలుడు ఏకంగా కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో చదువుకునే ఛాన్స్ కొట్టేశాడు. ఇది రెండు దశాబ్దాల క్రితం జరిగింది. అరాన్ ఫెర్నాండజ్ తన తండ్రి నీల్ వద్ద ఇంట్లో తొలిపాఠాలు నేర్చాడు. ఇపుడు ఫిట్జ్‌విలియమ్ కాలేజీలో గణితంలో డిగ్రీ చేయడానికి సిద్ధపడ్డాడు. అందరికంటే అతి కష్టమైన విభాగాన్ని ఎంచుకోవడంతో అందరి దృష్టి అతనిపైనే నిలిచింది. ఇంతటి కష్టమైన సబ్జెక్టును 1773లో 14ఏళ్ళ విలియం పిట్ ఎంపిక చేసుకున్నాడు. "మొదటి సంవత్సరం పుస్తకాలు చదవడం మొదలెట్టాను, అంత కష్టంగా లేవు. కేంబ్రిడ్జ్‌కి వెళ్లడం అనేది ఎంతో ఉత్సాహాన్ని కలిగించింది. మరీ ముఖ్యంగా చిన్నవయసులోనే ఆ ప్రాంగణంలో అడుగుపెడుతున్నందుకు. నాకంటే ముందు విలియమ్ 14 ఏళ్లవయసులోనే సీటుసంపాదించాడు" అరాన్ ఫెర్నాండెజ్ అన్నాడు. విలియం తీసుకున్న ట్రిపోస్ అనేది గణితంలోనే ఎంతో క్లిష్టమైన అంశం. ఐజాక్ న్యూటన్, స్టీఫెన్ హాకింగ్ వంటి ప్రపంచ ప్రముఖ మేధావులు ఆ కోర్సు చేయగలిగారు.

## అభివృద్ధి ఆలోచన చిన్న వయసులోనే వస్తుంది

ఎంతో ఉన్నత స్థితికి చేరుకునేవారు, ఎంతో పేరు ప్రఖ్యాతులు సంపాదించుకునేవారు ఆ స్థాయికి చేరుకోవడం అనేది పెద్దయ్యాక జరిగేది కాదు. నిజానికి వారు పాఠశాల వయసులో ఉండగానే ఆ ఆలోచన కలిగి, అది ఆ దిశగా వారు పయనించేట్టు చేస్తుందని ఇటీవల ఒక సర్వే తెలియజేసింది. పాఠశాల వయసులోనే సృజనాత్మక అంశాల్లో ఆసక్తి చూపుతుండేవారు, వాటిలో ఎంతో చురుగ్గా పాల్గొనే వారు మరింత ఉన్నత చదువులు చదివేందుకు, ఉన్నత స్థాయికి చేరుకునేందుకు అవకాశాలున్నాయని సర్వే తేల్చింది. బడి వయసు పిల్లలు భవిష్యత్తులో తాము చదవదలచిన చదువు, భవిష్యత్ జీవితం గురించి చేసుకునే ఆలోచనలు తప్పకుండా సాధించేట్టు ప్రవర్తిస్తూ చదువులో రాణిస్తుంటారని ఆ లక్ష్యాలు వారిని ముందుడుగు వేయిస్తాయని సైకాలజీ ప్రొఫెసర్ క్రాకెట్ అన్నారు.






## ఫిజికల్ ఎడ్యుకేషన్‌కు ప్రాధాన్యత

ఇక సిబిఎస్ఇ పాఠశాలల్లో ఫిజికల్ ఎడ్యుకేషన్‌కు ప్రాధాన్యతనీయనున్నారు. ఆ సిలబస్ అనుసరిస్తున్న పాఠశాలలన్నీ ప్రతిరోజూ ఒక పీరియడ్ ఇందుకు కేటాయించాలని ఆదేశాలు జారీచేశారు. ఇకనుంచి తప్పకుండా ఆటపాటలకు ప్రాధాన్యతనివ్వమని సిబిఎస్ఇ ఛైర్మన్ వినీత్ జోషి తమ ఆదేశంలో పేర్కొన్నారు. అంటే పదో తరగతి వరకూ విద్యార్థులకు 40-45 నిమిషాలపాటు ప్రతి రోజూ విద్యార్థులకు వ్యాయామం, ఆటలకు కేటాయిస్తారు. కాగా 11, 12 తరగతుల విద్యార్థులకు వారంలో 90 నుంచి 120 గంటలు ఇందుకు కేటాయిస్తారు. తమ పాఠశాలల్లో పిల్లలకు ప్రత్యేకంగా ఆరోగ్యాభివృద్ధికి సంబంధించి క్లబ్‌లను ఏర్పాటుచేయాలని గతంలో సిబిఎస్ఇ ఆదేశించిన సంగతి తెలిసిందే.



### పొదుపులో అధికభాగం

## చదువు కోసమే

భారతీయుల్లో అత్యధికశాతం మంది పొదుపు చేయడం పిల్లల చదువుల కోసమేనట. అవీవా లైఫ్ ఇన్స్యూరెన్స్ ఇటీవల జరిపిన ఓ సర్వేలో ఈ విషయం వెల్లడైంది. సర్వేలో పాల్గొన్న 67శాతం మంది పిల్లల చదువుకోసం తాము పొదుపు చేస్తున్నట్లు పేర్కొన్నారు. రియల్‌ఎస్టేట్, ఇతర రంగాల్లో పెరుగుతున్న వ్యయంతో పోలిస్తే చదువుకయ్యే ఖర్చు గణనీయంగా పెరిగిపోతోందని మొత్తం మీద 77శాతం మంది అభిప్రాయపడ్డారు. సర్వేలో పాల్గొన్న మూడింట రెండువంతల మంది పిల్లల వయస్సు ఐదేళ్లు ఉన్నప్పటినుంచి, వీలైయితే స్కూలులో చేరడానికి ముందు నుంచే వారి చదువుకోసం పొదుపుచేయడం ప్రారంభించినట్లు పేర్కొనడం విశేషం. మొత్తం మీద 25 దేశాల్లో సాగిన ఈ సర్వేలో పిల్లల చదువుకోసం పెట్టుబడిపెట్టడం అత్యుత్తమ మార్గమని సుమారు 44 శాతం మంది అభిప్రాయపడగా.. ఇతర దేశాల్లో అది కేవలం 17శాతంగా ఉంది.



## మీకు తెలుసా.. ?

అమెరికాలో స్కూళ్లకు రాగానే పిల్లలు.. తాము వేసుకొచ్చిన షూలను విప్పి.. స్కూల్లో ఉండే మరో జత షూలను ధరించాల్సి ఉంటుంది. క్లాసురూమ్‌లో నునుపైన ఉపరితలాలపై పిల్లలు జారిపడకుండా ఉండటానికి, అదేవిధంగా స్కూలు ఆవరణలో పరిశుభ్రతను పెంచడానికి ఈ చర్యలు తీసుకుంటుంటారు. ఇక మరో విషయం.. అమెరికా స్కూళ్లలో చూయింగ్ గమ్ నమలడం నిషిద్ధం. ఎందుకంటే.. చూయింగ్ గమ్ నమిలేవారు పాఠాలపై దృష్టి పెట్టలేరన్న భావనే దీనికి కారణం.

జపాన్‌లో ఒక వింత నిబంధన ఉంది. స్కూలు పిల్లలు ఎలాంటి లో దుస్తులు ధరించాలో పాఠశాల యాజమాన్యాలు సూచిస్తుంటాయి. అదేవిధంగా ఆడపిల్లలు ధరించే సాక్స్‌లను ఏవిధంగా పైకి మడవాలి.. ఫుల్‌హ్యాండ్స్ వేసుకొని మగపిల్లలు వాటిని ఎంతవరకు వాటిని మడవాలన్న విషయంలో స్కూలు యజమాన్యాలు చాలా నిక్కచ్చిగా ఉంటాయి.

బ్రిటన్ స్కూళ్లలో పిల్లల హెయిర్ స్టైయిల్స్‌పై స్కూలు యాజమాన్యాలు చాలా కఠినంగా వ్యవహరిస్తుంటాయి. మగపిల్లలు జుట్టు వారి కాలర్‌ను తాకడానికి వీలులేదు. ఆ విధంగా జుట్టు పెరిగి ఉంటే వారిని పాఠశాలల్లోకి అనుమతించరు.

ఆట

## స్పాట్ ది లెటర్

**ఇండోర్/అవుట్‌డోర్**

**వయసు: అయిదు నుంచి (అక్షరాలు)**

**వయసు: ఆరు నుంచి (మాటలకి)**

ఆడే విధానం :

కొంతమంది పిల్లలకి దినపత్రికలోని తలో పేజీ యిచ్చి, వాళ్ళని ఆ పేజీలోని ఓ నిర్ణీత అక్షరం చుట్టూ చతురస్రాకారంగా గీయమనాలి. లేదా ఆ అక్షరం మీద ఇంటూ గుర్తు పెట్టమనాలి. ఆ అక్షరం ఇంగ్లీష్‌లో ఎ నుంచి జడ్ దాకా ఏ అక్షరం అయినా కావచ్చు. ఇంగ్లీష్ పేపరయితే ఇంగ్లీష్, అక్షరం, తెలుగు దినపత్రిక అయితే తెలుగు అక్షరం ఏదయినా ఒకటి (ఆ నించి అః లోగా అచ్చులే అయితే మంచిది. హల్లులయితే వత్తులు, దీర్ఘాలు, ఒత్వాలు వంటివి వుంటాయి కనుక) చెప్పి స్టార్ట్ చెప్పగానే వాళ్ళ లీడర్ సూచించిన ఆ నిర్ణీత అక్షరం వెదికి గుర్తుపెట్టాలి.

మూడు లేక అయిదు నిముషాల కాలపరిమితి తర్వాత ఒకరి పేపర్ ఇంకొకరు తీసుకుని, ఆ నిర్ణీత అక్షరాలన్నింటికీ రెండోవాడు కరక్టుగా గుర్తు పెట్టాడా లేక వదిలేసారా అన్నది పరీక్షించాలి. అందరికన్నా ఎక్కువ అక్షరాలు వదిలేసినవారు ఓడిపోయినట్లు. అన్ని అక్షరాలని కరెక్టుగా గుర్తించినవారు గెలిచినట్లు.

లేదా అందరికన్నా ఎక్కువ అక్షరాలకి గుర్తు పెట్టిన వాళ్ళు గెలిచినట్టుగా కూడా భావించవచ్చు. అయితే ఈ ఆట ఫెయిర్‌గా వుండటానికి వివిధ తేదీల దినపత్రికలుకాక, ఒకే తేదీ, ఒకే దినపత్రికని ఎవరికి వాళ్ళు తమ ఇళ్ళనించి తీసుకురమ్మని చెప్పి, అంతా అందులోని ఒకే పేజీలోని అక్షరాలని గుర్తుపెట్టమనాలి.



అక్షరాలకి బదులు చిన్న చిన్న మాటలు కూడా గుర్తుపెట్టమనవచ్చు. ఇంగ్లీష్ పేపర్ అయితే అండ్, బట్, ఇన్, టు, ఆర్, ఎట్ లాంటి పదాలు, తెలుగయితే దినపత్రికలో తరచు ఉపయోగించే కాగా, అయితే, అన్నారు లాంటి పదాలను గుర్తుపెట్టాలి.

**- మల్లాది వెంకటకృష్ణమూర్తి 'పిల్లల ఆటలు' నుంచి...**




Roll no - 420

Q1 Explain digestive system ?

ans Its a process that start with right hand & ends with left .

Q2 What is the chemical formula for water ?

ans h,i,j,k,l,m,n,o (h to o).

Q3 Till when second world war was fought ?

ans from page no 26 to page no 43 .

Q4 Who was Bhagat Singh ?

ans Ajay Davegan, Boby Deol, Manoj Kumar ,etc

Q5 Who was Adlof Hitler ?

ans this person.

0/10

## అమృతం

అమ్మ పెట్టిన బువ్వ అమృతం
నాన్న చెప్పిన కథ అమృతం
అక్క నేర్పిన పాఠం అమృతం
అన్న ఆడించిన ఆట అమృతం
తమ్ముడు చేసిన అల్లరి అమృతం
చెల్లి పెట్టిన బుంగమూతి అమృతం
పిన్ని చెప్పిన పాఠాలు అమృతం
బాబాయి తెచ్చిన మిఠాయిలు అమృతం
తాతయ్య చెప్పిన చరిత్ర అమృతం
అమ్మమ్మ చూపిన గుడులు అమృతం
గురువు చెప్పిన చదువు అమృతం
స్నేహితులు నేర్పిన మేజిక్స్ అమృతం

**- కంచర్ల శ్రీచక్రి. 9వ తరగతి,**
**నారాయణ-2 టెక్నో స్కూల్,**
**వెంకట్‌నగర్, కాకినాడ.**



**After explaining to a student through various lessons and examples that:**

$$\lim_{x \to 8} \frac{1}{x-8} = \infty$$

**I tried to check if she really understood that, so I gave her a different example. This was the result:**

$$\lim_{x \to 5} \frac{1}{x-5} = \rotatebox{90}{5}$$



చదవడం రావడమే విద్య కాదు, అనుభవంతో అంతకు మించి తెలుసుకునేదే అసలైన విద్య.

- పీట్ సీగర్

అనాలోచిత మనసు స్థానంలో ఆలోచించే మనసునివ్వడమే విద్య ప్రాధాన్యత

- మాల్కమ్ ఫోర్బ్స్

పిల్లలు బాగా చదివితే తలిదండ్రుల కంటే చదువుచెప్పేవారే ఎక్కువ గౌరవం పొందుతారు. తలిదండ్రులు కేవలం జీవితాన్నే ఇస్తారు, వారు ఎంతో బాగా జీవించే కళను నేర్పుతారు.

-అరిస్టాటిల్




# బడికి ఎంతో లాభం
# ముగిసిన డీఎస్సీ 2008




సుమారు రెండేళ్ల ఉపాధ్యాయ అభ్యర్థుల నిరీక్షణ ఎట్టకేలకు ఫలించింది. డీఎస్సీ 2008తో రాష్ట్ర ప్రభుత్వం చేపట్టిన టీచర్స్ రిక్రూట్‌మెంట్ నవంబర్ మొదటివారంతో ముగిసింది. ఎన్నికల వేళ అప్పటి వైఎస్ సర్కార్ ప్రకటించిన 50వేల మెగా డీఎస్సీ.. లక్షల మంది నిరుద్యోగుల్లో ప్రభుత్వ ఉద్యోగం పట్ల ఆశను రగిలించింది. అయితే నోటిఫికేషన్ వెలువడటానికి ముందు నుంచే డీఎస్సీ-2008ను వివాదాలు చుట్టుముట్టాయి. కేవలం రాజకీయ ప్రయోజనాలు ఆశించి ఈ డీఎస్సీ నోటిఫికేషన్ విడుదల చేశారన్న



నిరసన ధ్వనులు వినిపించాయి. అయితే వేలమంది నిరుద్యోగులకు ఉద్యోగాలు కల్పించే డీఎస్సీకు రాజకీయేతర కారణాలే అవరోధంగా పరిణమించాయి. డీఎడ్- బీఎడ్ అభ్యర్థుల వివాదం ఈ వ్యవహారాన్ని కోర్టుకు లాగగా.. భర్తీల సమయంలో క్షేత్రస్థాయిలో సుమారు పదివేల ఎస్జీటీ పోస్టులు లేవన్న మరో కారణంగా... అభ్యర్థుల భవితవ్యం డోలాయమానంలో పడింది. క్వాలిఫై అయిన అభ్యర్థుల ధర్నాలు, ఆత్మహత్యా యత్నాలు... సచివాలయంతో పాటు.. ముఖ్యమంత్రి నివాసం ముట్టడి... ఇలా పలు ఆందోళన కార్యక్రమాల తరువాత.. స్పందించిన రాష్ట్ర సర్కార్ డీఎస్సీ- 2008కు రాష్ట్ర కేబినెట్ పచ్చజెండా చూపింది. దీనివల్ల కేవలం వేల నిరుద్యోగులకు ఉపాధి కల్పించడమే కాకుండా...బడికి మరెంతో మేలు జరిగిందని చెప్పవచ్చు.

### ముగిసిన కౌన్సెలింగ్

నోటిఫికేషన్‌లో పేర్కొన్న 30,813 పోస్టులకు గాను తొలివిడతగా 26,700 పోస్టులకు నవంబర్ నెల 3, 4 తారీఖుల్లో పాఠశాల విద్యాశాఖ కౌన్సెలింగ్ నిర్వహించింది. నోటిఫికేషన్‌ను అనుసరించి 27,020మంది ప్రాథమికంగా ఎంపికకాగా, వీరిలో 22,246మందికి నియామక పత్రాలను ఇచ్చారు. కౌన్సెలింగ్‌కు దూరంగా ఉన్న 2346మందికి నవంబర్ 23న మరోసారి కౌన్సెలింగ్ నిర్వహించారు. పోస్టుల కొరత కారణంగా ప్రాథమిక జాబితాకు ఎంపికైనా 2428మందికి నియామక పత్రాలను ఇవ్వలేదు. వీరికి ఖాళీలను అనుసరించి నియామక పత్రాలను ఇస్తారు.

### బడికి లాభం

పెరిగిన జనాభాకు అనుగుణంగా.. గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో సర్కారు బడులు సరిపోయినన్ని లేవు. చాలాచోట్ల 100నుంచి 150మంది చిన్నారులకు ఒకే ఉపాధ్యాయుడు బోధించాల్సిన పరిస్థితి నెలకొంది. తాజా నియామకాల వల్ల ప్రస్తుత ఉపాధ్యాయులపై పడుతున్న పని ఒత్తిడి భారీగా తగ్గే అవకాశం ఉంది.

ప్రమోషన్‌కు అర్హులైన సీనియర్ సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయులు రాష్ట్రవ్యాప్తంగా వేల సంఖ్యలో ఉన్నారు. వీరు గడిచిన కొన్ని సంవత్సరాలుగా ప్రమోషన్ కోసం ఎదురుచూస్తున్నారు. క్లియర్ వెకెన్సీలు మినహా మిగిలిన పోస్టుల్లో సుమారు ఐదువేల పోస్టులను ఉపాధ్యాయుల పదోన్నతుల అనంతరం భర్తీ చేయాలని నిర్ణయించుకోవడంతో జిల్లాకు రెండుమూడువందల మంది ఉపాధ్యాయుల చొప్పున రాష్ట్రవ్యాప్తంగా ఐదువేల మంది ఉపాధ్యాయులకు పదోన్నతులు లభించాయి. అదేవిధంగా దీని ముందు డీఎస్సీ 2008 పుణ్యమా అని టీచర్ల బదిలీలు కూడా చోటుచేసుకున్నాయి. డీఎస్సీ 2008 నోటిఫికేషన్‌లో పేర్కొన్న ఎస్జీటీ పోస్టులకు కొరత ఏర్పడటంతో గత ఆరునెలల్లోనే పలుదఫాలుగా పదోన్నతులు నిర్వహించారు.

### ప్రతినెలా ప్రమోషన్లు

2008 డీఎస్సీ భర్తీల ప్రక్రియ పుణ్యమా అని.. ఇకపై ప్రతినెలా ఉపాధ్యాయులకు పదోన్నతులు లభించనున్నాయి. ఖాళీలను అనుసరించి అర్హులైన వారికి కౌన్సెలింగ్ ద్వారా పదోన్నతులు ఇవ్వనున్నారు. స్కూల్ అసిస్టెంట్, హెడ్మాస్టర్ పోస్టులకు ఈ ప్రక్రియ నిర్వహిస్తారు. ఇక మీదట ఉపాధ్యాయుల పదవీ విమరణను అనుసరించి ఏ నెలకానెల కౌన్సెలింగ్ ద్వారా ఈ సౌలభ్యాన్ని కల్పించనున్నారు. బీసీ, ఇతర సంక్షేమ శాఖల హాస్టళ్ల వార్డెన్ల పోస్టులు, ఇతర పోస్టులకు టీచర్లను డిప్యూటేషన్‌పై పంపడం ద్వారా ఏర్పడ్డ ఖాళీలను డీఎస్సీ 2008 ద్వారా భర్తీ చేయాలని నిర్ణయించడం హర్షించదగ్గ నిర్ణయమే. దీని వల్ల మానవ వనరుల కొరత ఎదుర్కొంటున్న ఆయా విభాగాలకు ఓ మేరకు స్వాంతన చేకూరినట్లే. ఇవన్నీ ఎస్జీటీ పోస్టులను టీచర్ల పదవీ విరమణ ద్వారా ఖాళీ అయ్యే పోస్టులకు అనుగుణంగా భర్తీ చేయనున్నారు. ఈ నేపథ్యంలో రానున్న రోజుల్లో...విద్యాశాఖలో ఖాళీగా ఉన్న ఉపాధ్యాయుల పోస్టులే కనిపించనట్లే.



# విద్యారంగ సమాచారం




## పాఠశాలలు సైట్‌లో నమోదు చేసుకోవాలి

ఉపకారవేతనాల పథకం కింద విద్యార్థులు దరఖాస్తు చేసేందుకు ఆయా పాఠశాలలు ముందుగా వెబ్‌సైట్‌లో నమోదు చేసుకోవాలని మైనారిటీ కార్పొరేషన్ పేర్కొంది. వెబ్‌సైట్‌లో రిజిస్ట్రేషన్ పూర్తి చేసిన తరువాత ఆ ప్రతులను తీసుకొని కార్పొరేషన్ జిల్లా ఈడీలను సమర్పించాలని సూచించింది. అలాగే పాఠశాల ప్రధానోపాధ్యాయులు, ప్రిన్సిపాల్స్ యూజర్ ఐడీ, పాస్‌వర్డ్ పొందాలని తెలిపింది.

## ఘనంగా బాలల హక్కుల వారోత్సవాలు



బాలల హక్కులు విద్యా హక్కు చట్టం-2009పై అవగాహన కల్పించేందుకు నవంబర్ 14 నుంచి 21 వరకు రాజీవ్ విద్యా మిషన్ బాలల హక్కుల వారోత్సవాలను ఘనంగా నిర్వహించింది. నవంబర్14వ తేదీన జిల్లాస్థాయి చిత్రలేఖన పోటీలను నిర్వహించారు. వారం రోజులపాటు జరిగిన కార్యక్రమంలో విద్యాహక్కులపై కళాజాతాలను, గ్రామస్థాయి ర్యాలీలను నిర్వహించారు. బయటి బయట ఉన్న పిల్లలకు వారి కోసం ఏర్పాటు చేసిన ప్రత్యేకశిక్షణా కార్యక్రమాల గురించి వివరించడంతోపాటు, వారిని తిరిగి బడికి చేర్చేదిశగా చర్యలు చేపట్టారు. వివిధ జిల్లా కేంద్రాల్లో బాలకార్మికుల విముక్తి కోసం ప్రత్యేక డ్రైవ్ నిర్వహించి వారిని తిరిగి పాఠశాలల్లో చేర్చారు.

## కాలేజీ బాటలో మురికివాడ విద్యార్థులు

న్యూఢిల్లీ: నగరంలోని పలు మురికివాడల్లో నివసిస్తున్న పిల్లలు 170మంది కాలేజీ చదువుకు సిద్ధపడ్డారు. ఆస్ట్రేలియా హైకమిషన్ ఆర్థికమద్దతుతో వారు తమ పాఠశాల చదువును పూర్తిచేశారు. కమిషన్ తమ జీవితాల్లో ఎంతో గొప్పమార్పు తీసుకువచ్చిందని హర్షం వ్యక్తంచేశారు. న్యూఢిల్లీలోని 'ఆశ' అనే ఎన్‌జిఓ సంస్థతో కలిసి ఆస్ట్రేలియా హైకమిషన్ పలుమురికివాడలోని పిల్లల సంక్షేమానికి ఎంతో కృషి చేస్తోంది. ఆస్ట్రేలియా హైకమిషన్ 170మంది పిల్లలకు పాఠశాల చదువు పూర్తిచేసుకోవడానికి ఆర్థికమద్దతునిచ్చేవిధంగా నిధిని ఏర్పాటు చేసింది. ఆ తర్వాత కాలేజీలో, ఢిల్లీవిశ్వవిద్యాలయం వంటి విశ్వవిద్యాలయాల్లో చేరడానికి ఎన్‌జిఓ సంస్థ ఆశకు మద్దతునిస్తోంది. ఢిల్లీలోని మురికివాడల పిల్లలు మంచి విద్యావకాశాలు అందిపుచ్చుకోవడానికి 'ఆశ' చేస్తున్న కృషిపట్ల ఆస్ట్రేలియా హైకమిషనర్ పీటర్ హర్షం వ్యక్తం చేశారు.

## శ్రీచైతన్య విద్యార్థికి ఒలింపియాడ్ ర్యాంక్

ఇగ్నో-యునెస్కో సంయుక్తగా నిర్వహించిన సైన్స్ ఒలింపియాడ్-2010లో శ్రీచైతన్య విద్యార్థి మహ్మద్ హఫీఉల్లారహ్మాన్ మొదటి ర్యాంక్ సాధించాడు. అన్ని సార్క్ దేశాలు పాల్గొన్న ఈ ప్రతిష్టాత్మక సైన్స్ ఒలింపియాడ్‌లో తమ విద్యార్థికి మొదటిర్యాంక్ రావడం పట్ల శ్రీచైతన్య విద్యాసంస్థల చైర్మన్ బి.ఎస్.రావు హర్షం వ్యక్తం చేశారు.



## బాల కార్మిక నియంత్రణకు ప్రత్యేక విభాగం

బాలకార్మిక నియంత్రణకు రాష్ట్ర ప్రభుత్వం కార్మిక శాఖలో ప్రత్యేక విభాగాన్ని ఏర్పాటు చేసింది. దీనికి సంబంధించి ఇటీవల ఉత్తర్వులను జారీ చేసింది. అన్ని రాష్ట్రాల్లో బాల కార్మిక నియంత్రణ విభాగాలను ఏర్పాటు చేయాలన్న సుప్రీంకోర్టు ఆదేశాల మేరకు ఈ నిర్ణయం తీసుకున్నారు.

## విద్యా వాలంటీర్లకు ఉద్వాసన

డీఎస్సీ-2008 నియామకాలు పూర్తి కావడంతో ప్రభుత్వం విద్యా వాలంటీర్లకు ఉద్వాసన పలికేందుకు సిద్ధమైంది. తొలిదశలో భాగంగా సుమారు 26వేల మందికి ఉద్వాసన పలకనున్నారు. రాష్ట్రవ్యాప్తంగా సుమారు 60వేల మంది ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాలల్లో వాలంటీర్లుగా సేవలందిస్తున్నారు.

బాల్యానికి భరోసా...

# బాల ఆరోగ్య రక్ష

బాలల దినోత్సవాన్ని పురస్కరించుకొని రాష్ట్రప్రభుత్వం రాష్ట్రంలోని అన్ని ప్రభుత్వ, ఎయిడెడ్ పాఠశాలల్లోని విద్యార్థిని, విద్యార్థుల ఆరోగ్య పరిరక్షణకు 'జవహర్ బాల ఆరోగ్య రక్ష' పథకాన్ని ప్రారంభించింది. ముఖ్యమంత్రి రోశయ్య ఈ కార్యక్రమాన్ని రంగారెడ్డి జిల్లా రాజేంద్రనగర్ మండలంలోని నార్సింగ్ గ్రామంలో ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ గురుకుల పాఠశాలలో ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ భారత తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ పుట్టినరోజునాడు ఈ కార్యక్రమాన్ని ప్రారంభించడం తనకెంతో సంతోషంగా ఉందన్నారు. రాష్ట్రంలోని బడికి వెళ్లే చిన్నారులందరూ సంపూర్ణ ఆరోగ్యంతో విద్యాభ్యాస్యం చేయడానికి ఈ పథకం ఎంతో ఉపయోగపడుతుందని ముఖ్యమంత్రి పేర్కొన్నారు.

**పథకం ముఖ్యాంశాలు**

- రాష్ట్రంలోని 46,823 ప్రభుత్వ, ఎయిడెడ్ ప్రాథమిక, ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాల్లో 85.32 లక్షల మంది విద్యార్థులకు సమగ్ర ఆరోగ్యపరీక్షలు నిర్వహించడం, అవసరమైన వారికి రెఫరల్ ఆసుపత్రుల్లో ఉత్తమ వైద్యం అందించడం ఈ పథకం లక్ష్యం.
- ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల వైద్యాధికారి, నేత్ర వైద్య నిపుణుడు, పారా మెడికల్ సిబ్బందితో కూడిన వైద్య బృందం వారంలో రెండు రోజులపాటు పాఠశాలలకు వెళ్లి విద్యార్థులకు అన్ని రకాల వైద్య పరీక్షలు నిర్వహించాలి.
- విద్యార్థుల బరువు, వయసు, రక్తపోటు, షుగర్, హిమోగ్లోబిన్ మొదలైన వివరాలను ఎప్పటికప్పుడు వ్యక్తిగత జవహర్ బాల ఆరోగ్య రక్ష కార్డుల్లో నమోదు చేస్తారు.
- రక్తహీనత, పౌష్టికాహారలోపం, శారీరక, మానసిక ఎదుగుదల వివరాలను పొందుపరుస్తారు.
- ప్రతి విద్యార్థికి ఐదేళ్ల కోసం స్టూడెంట్ హెల్త్ రికార్డ్ పత్రాన్ని జారీ చేస్తారు
- ఐదు సంవత్సరాలలోపు పిల్లలకు విటమిన్ మాత్రలు, పది నుంచి 15 సంవత్సరాలలోపు వారికి టిబి ఇంజక్షన్లు వేయడంతోపాటు, రక్తహీనత ఉన్న పిల్లలకు ఐరన్ మాత్రలతోపాటు, పిల్లలందరికీ విటమిన్ బి మాత్రలు ఇస్తారు.
- పిల్లలకు నేత్ర పరీక్ష చేసి, ఉచితంగా కళ్లజోళ్లను ఉచిత ఆరోగ్య కేంద్రం ద్వారా అందిస్తారు.
- విద్యార్థులకు వ్యక్తిగత, పరిసరాల పరిశుభ్రతకు సంబంధించి అవగాహన కల్పిస్తారు.

వైద్య, ఆరోగ్య, విద్య, మహిళా శిశు సంక్షేమం, గిరిజన, సాంఘిక, వెనుకబడిన తరగతులు, మైనారిటీ సంక్షేమ శాఖలు సంయుక్తంగా 'బాల ఆరోగ్య రక్ష'ను అమలు చేయనున్నాయి. డిసెంబర్ ఒకటి నుంచి పిల్లలకు వైద్యపరీక్షలు నిర్వహించడం ప్రారంభిస్తారు. ఈ కార్యక్రమం మార్చి 10వరకు కొనసాగుతుంది.

ఆరోగ్య రుగ్మతలు, దీర్ఘకాలిక వ్యాధులకు సంబంధించి నివేదికలు రూపొందిస్తారు. అనంతరం ఈ వివరాలను పొందుపరుస్తూ విద్యార్థులకు స్టూడెంట్ హెల్త్ రికార్డ్‌ను ఇస్తారు. ఇక ప్రతి గురువారాన్ని స్కూల్ హెల్త్‌డే గా పరిగణిస్తారు. హెల్త్ అసిస్టెంట్లు, ఆరోగ్యపరిరక్షకులు, ఆరోగ్య విద్యాధికారి, కమ్యూనిటీ హెల్త్ నర్సుల్లో ఒకరైనా స్కూలును సందర్శించి, ఆరోగ్య పరిరక్షణ, పోషకాహారంపై అవగాహన కల్పిస్తారు.

ఈ కార్యక్రమాన్ని ప్రణాళికాబద్ధంగా నిర్వహించేందుకు మండల స్థాయిలో మండల విద్యాఖాధికారులు, వైద్యాధికారులు సంధానకర్తలుగా వ్యవహరిస్తారు. ప్రతి పాఠశాలకు ప్రాథమిక ఆరోగ్య కేంద్రం నుంచి ఒకరు, సంబంధిత ప్రధానోపాధ్యాయుడు హెల్త్ నోడల్ అధికారులుగా వ్యవహరిస్తారు. జిల్లా స్థాయిలో కలెక్టర్లు ఛైర్మన్లుగా స్క్రీనింగ్ కమిటీలను ఏర్పాటు చేస్తారు. ఈ కార్యక్రమం అమలు కోసం ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో రాష్ట్రప్రభుత్వం జాతీయ గ్రామీణ ఆరోగ్య కార్యక్రమం (ఎన్ఆర్‌హెచ్ఎం)కింద సుమారు పదికోట్ల రూపాయల నిధులను విడుదల చేసింది.






## కలామ్‌ను ఆశ్చర్యపరచిన పిల్లలు

భోపాల్ : భోపాల్‌లోని మోడల్ సీనియర్ సెకండరీ పాఠశాలలో ఇటీవల జరిగిన ఒక కార్యక్రమంలో మాజీ రాష్ట్రపతి అబ్దుల్ కలామ్ పాల్గొని అక్కడి పిల్లల సమాధానాలకు ఆశ్చర్యపోయారు. ఆయన 9, 11 తరగతుల పిల్లలతో మాట్లాడుతూ భవిష్యత్తులో శాస్త్రవేత్తలు, ఇంజనీర్లు కావాలని ఎందరు అనుకుంటున్నారని ప్రశ్నించారు. అంతే వెంటనే చాలామంది పిల్లలు చేతులెత్తారు. వారు చంద్రునివద్దకు వెళ్లాలన్న ఆశాభావం వ్యక్తం చేశారు. కలామ్ ఆ పిల్లల లక్ష్యంపట్ల ఎంతో ఆనందించారు.

2030నాటికి తనకు వందేళ్లు వస్తాయని, అపుడు మళ్లీ వచ్చి కలుస్తానని కలామ్ సరదాగా అన్నారు. అందుకు సమాధానంగా పిల్లలు కూడా జయజయధ్వానాలు చేశారు. 'మీలో ఎందరు రాజకీయనాయకులు కావాలనుకుంటున్నారు?' అని కలామ్ అడిగారు. ఆ ప్రశ్నకు ఒక్కరూ అంగీకారంగా చేతులెత్తలేదు. పిల్లలంతా కలామ్ ప్రసంగం పూర్తికాగానే పరుగున వెళ్లి ఆయన కరచాలనాలు అందుకున్నారు, కొందరు ఆయన ఫోన్ నెంబర్‌కూడా అడిగి ఆశ్చర్యపరిచారు. అందుకు ఆయన స్పందిస్తూ తన వెబ్‌సైట్ చూస్తుండమని, అభిప్రాయాలు తెలియజేస్తుండమని అన్నారు.

## సైన్స్ ఒలింపియాడ్ విజేతలకు సత్కారం

న్యూఢిల్లీ: ఇగ్నో-యునెస్కో సైన్స్ ఒలింపియాడ్ విజేతలను ఇటీవల ఇక్కడి ఇందిరాగాంధీ నేషనల్ ఓపెన్ యూనివర్సిటి (ఇగ్నో) క్యాంపస్‌లో ఘనంగా సత్కరించారు. సార్క్‌దేశాలు ఆఫ్ఘనిస్థాన్, బంగ్లాదేశ్, భూటాన్, మాల్దీవులు, శ్రీలంకలతో 83 దేశాలకు చెందిన 102 కేంద్రాల్లో, అలాగే భారత్‌లో 83 కేంద్రాల్లో ఆగస్టులో ఈ ఒలింపియాడ్ జరిగింది. మొత్తం 4,384 మంది 11వ తరగతి విద్యార్థులు ఈ ఒలింపియాడ్‌లో పాల్గొన్నారు. వీరిలో 41మందిని ఉన్నతస్థాయిలో ప్రదర్శించినవారిగా ఎంపికచేశారు. విజేతలుగా బహుమతులు అందుకున్నవారిలో భారత్ నుంచి 29మంది ఇతర సార్క్‌దేశాల నుంచి 12 మంది ఉన్నారు. "ఇగ్నో వర్సిటీలో ఇలాంటి ఒలింపియాడ్ జరగడం ఇదే మొదటిదని, విద్యార్థులు ఎంతో ఉత్సాహంగా పాల్గొన్నారని, భారీ స్పందన వచ్చింద"ని ఇగ్నో వైస్ ఛాన్సలర్ వి.ఎన్.రాజశేఖరన్ పిళ్లై అన్నారు.

## ప్రభుత్వ పాఠశాల్లో పిల్లలకు ఉచితంగా యూనిఫామ్- రాష్ట్ర ప్రభుత్వ నిర్ణయం

ప్రభుత్వ పాఠశాలల్లో దారిద్ర్యరేఖకు దిగువనున్న 52లక్షల మంది విద్యార్థులకు రాష్ట్ర ప్రభుత్వం ఉచిత యూనిఫామ్‌లను అందివ్వనుంది. దీనికి సుమారు 210 కోట్ల రూపాయలు వ్యయం కానుంది. ఈవ్యయాన్ని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు 65:35 నిష్పత్తిలో భరించనున్నాయి. ప్రాథమిక విద్య పురోగతి, విద్యాహక్కు చట్టంపై ముఖ్యమంత్రి నేతృత్వంలో ఇటీవల జరిగిన ఉన్నతస్థాయి సమావేశంలో ఈ నిర్ణయం తీసుకున్నారు. జనవరి నుంచి ఈ కార్యక్రమం ప్రారంభమవుతుంది. అయితే దీనికి ఇంకా కేంద్రప్రభుత్వం గ్రీన్‌సిగ్నల్ ఇవ్వాల్సి ఉంది. మరోవైపు వస్త్రాల కొనుగోలు, నాణ్యత, వాటిని సైజులవారీగా కుట్టించి ఇవ్వడం ఇత్యాది పనులన్నీ డిసెంబర్ 31లోగా ముగించడం కష్టమని అధికారులు అభిప్రాయపడుతున్నారు. మరోవైపు ప్రభుత్వం తలపెట్టిన యూనిఫాం పంపిణి బాధ్యతలను ఆప్కోకు అప్పగించాలని శాసనసభా సంఘం (బీసీ సంక్షేమం) ప్రభుత్వానికి సూచించింది.

## పాలసీ అమలుకు పెట్టుబడులు అవసరం: సిబాల్



న్యూఢిల్లీ: ఉన్నతవిద్యలో పెట్టుబడులు మరింత విస్తృతం చేయాల్సిన అవసరం ఎంతో ఉందని కేంద్ర మానవవనరులశాఖ మంత్రి కపిల్ సిబాల్ అభిప్రాయపడ్డారు. ఇటీవల జాతీయ విద్యాదినం సందర్భంగా ఇక్కడ జరిగిన ఒక ప్రత్యేక కార్యక్రమంలో ఆయన మాట్లాడుతూ 2020 నాటికి ఉన్నత పాఠశాలల్లో చేరేవారు 30శాతం పెరగాలంటే పెట్టుబడులు పెట్టడానికి విధివిధానాలకు సంబంధించిన ప్రణాళిక అవసరమన్నారు. కేవలం విద్య పరీక్షల్లో ఉత్తీర్ణత కోసమే కాకుండా పిల్లల అభివృద్ధికి సంబంధించినదిగా ఉండాలని అభిప్రాయపడ్డారు. విద్యాదినోత్సవం సందర్భంగా ఫిక్కీ ఏర్పాటుచేసిన మరో కార్యక్రమంలో సిబాల్ మాట్లాడుతూ 2020 నాటికి లక్ష్యాన్ని చేరుకోవడానికి విద్యారంగంలో తగిన మౌలిక వసతులు కల్పించాలని, ప్రైవేటురంగం అందుకు పూనుకోవాలని సూచించారు.

Printed and published by M. Sridhar Rao on behalf of AKSHARA ENTERPRISES, D.NO. 3-6-521, FLAT NO.401, GHARONDA MAYA, HIMAYATH NAGAR, HYDERABAD-29 and printed at SREE MATHA PRINTERS, 1-1-562/1, GANDHI NAGAR, HYDERABAD-20. Published at AKSHARA ENTERPRISES, D.NO. 3-6-521, FLAT NO.401, GHARONDA MAYA, HIMAYATH NAGAR, HYDERABAD-29. Editor N. Mohan Kumar.

KRSA101M250

RNI No.: APTEL/2010/32863

Naveena Vidya, December 2010

మాసపత్రిక



# నవీనవిద్య

A COMPLETE GUIDE FOR SCHOOLING

## 2011 సెలవులు

### సాధారణ సెలవులు

| పండుగ | తేదీ | వారం |
|---|---|---|
| 1. బోగి | 14.01.2011 | శుక్ర |
| 2. సంక్రాంతి | 15.01.2011 | శని |
| 3. రిపబ్లిక్ డే | 26.01.2011 | బుధ |
| 4. మిలాద్-ఉన్-నబి | 16.02.2011 | బుధ |
| 5.మహాశివరాత్రి | 02.03.2011 | బుధ |
| 6.హోలీ | 19.03.2011 | శని |
| 7.ఉగాది | 04.04.2011 | సోమ |
| 8. జగ్జీవన్ రామ్ జయంతి | 05.04.2011 | మంగళ |
| 9.శ్రీరామనవమి | 12.04.2011 | మంగళ |
| 10. అంబేద్కర్ జయంతి | 14.04.2011 | గురు |
| 11.గుడ్‌ఫ్రైడే | 22.04.2011 | శుక్ర |
| 12.స్వాతంత్ర దినోత్సవం | 15.08.2011 | సోమ |
| 13.శ్రీకృష్ణాష్టమి | 23.08.2011 | మంగళ |
| 14. రంజాన్ | 31.08.2011 | బుధ |
| 15. వినాయకచవితి | 01.09.2011 | గురు |
| 16.దుర్గాష్టమి | 04.10.2011 | మంగళ |
| 17.విజయదశమి | 06.10.2011 | గురు |
| 18.దీపావళి | 26.10.2011 | బుధ |
| 19.బక్రీద్ | 07.11.2011 | సోమ |
| 20.మొహర్రం | 06.12.2011 | మంగళ |

ఆదివారం వచ్చే సెలవులు

| | | |
|---|---|---|
| 1.గాంధీ జయంతి | 02.10.2011 | |
| 2.క్రిస్మస్ | 25.12.2011 | |

### ఐచ్ఛిక సెలవు దినాలు

| పండుగ | తేదీ | వారం |
|---|---|---|
| 1. ఆంగ్ల సంవత్సరాది | 01.01.2011 | శని |
| 2. అర్బేయీన్ | 25.01.2011 | మంగళ |
| 3. శ్రీపంచమి | 08.02.2011 | మంగళ |
| 4. యాజ్ దహుమ్ షరీఫ్ | 17.03.2011 | గురు |
| 5. మహావీర్ జయంతి | 16.04.2011 | శని |
| 6. సయ్యద్ మహ్మద్ జువాన్‌పురి జయంతి | 20.04.2011 | బుధ |
| 7. బసవ జయంతి | 06.05.2011 | శుక్ర |
| 8. బుద్ధ పూర్ణిమ | 17.05.2011 | మంగళ |
| 9. హజ్రత్ అలీ జన్మదినం | 16.06.2011 | గురు |
| 10. షాబ్-ఇ-మీరజ్ | 30.06.2011 | గురు |
| 11. వరలక్ష్మీ వ్రతం | 12.08.2011 | శుక్ర |
| 12. పార్సీ సంవత్సరాది | 19.08.2011 | శుక్ర |
| 13. జుమత్-ఉల్-విదా | 26.08.2011 | శుక్ర |
| 14. మహాలయ అమావాస్య | 27.09.2011 | మంగళ |
| 15. మహర్నవమి | 05.10.2011 | బుధ |
| 16. కార్తీకపౌర్ణమి/గురునానక్ జయంతి | 10.11.2011 | గురు |
| 17. తొమ్మిదో మొహర్రమ్ | 05.12.2011 | సోమ |
| 18. ఈద్-ఇ-గద్దర్ | 16.12.2011 | శుక్ర |
| 19. క్రిస్మస్ ఈవ్ | 24.12.2011 | శని |
| 20. బాక్సింగ్ డే | 26.12.2011 | సోమ |

ఆది, రెండో శనివారం వచ్చే ఐచ్ఛిక సెలవులు

| | | |
|---|---|---|
| 1. కనుమ | 16.01.2011 | ఆది |
| 2. రథయాత్ర | 03.07.2011 | ఆది |
| 3.షాబ్-ఇ-బారాత్ | 17.07.2011 | ఆది |
| 4. రాఖీ పౌర్ణమి | 13.08.2011 | శని |

జీవితాన్ని ఉత్సాహభరితం చేయాలంటే అందుకు అభివృద్ధిచెందే స్వేచ్ఛని, మార్గాన్ని కల్పించాలి.
ఈ రెండు ఉపాధ్యాయులు, బడి వల్లనే సాధ్యపడుతుంది.

– మరియా మాంటిస్సోరి



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA101M250 |
| పుస్తకం పేరు | శివవిద్య |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | S.Lakshmi |
| పేజీలు విడదీసినది | [illegible] |
| స్కాన్ చేసినది | K.Daveed |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |